

# అభినవసరస్వ



| సంపుటము | ధాతృనామ సంవత్సరము | |
|---|---|---|
| ౨౮ | ఆషాఢమాసము | ౮ |

## కృతివిమర్శము.

అభినవ సుమతిశతకము — కృతికర్త దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు. నెల్లూరు. దీనివెల రెండణాలే. కాని యమూల్యమైన గ్రంథము. సుప్రసిద్ధమైన ప్రాచీన సుమతిశతక మొకటియుండుటచే శర్మగారు దీని కభినవ సుమతిశతకమని పేరుఁ బెట్టిరి. ఇప్పుడిప్పుడు గవర్నమెంటుస్కూళ్ళలో దాని ప్రచార మొకింత తగ్గినది కాని చిరకాలమునుండియుఁ బ్రాచీన సుమతిశతకమును పల్లెటూళ్ళబడులలో బాలురచేఁ బఠింపింపని పంతులే లేఁడు. నీతుల కిక్కయై నివ్వటిల్లుటచే నట్లు జరుగుచు వచ్చినది. అట్టిశతకము నభినవ సుమతిశతకము వచ్చి వెనుకకు నెట్టివేసినది. ఇందులకు హేతువు కేవల నూతనప్రియత్వమే కాదు. ప్రాచీన సుమతశతిక మెంతనీతి బోధకమైనను నిరంకుశత్వముతో నించుక పారుష్యము గలిగి పరంగుచున్నయది. అయ్యది లేకుండ నభినవ సుమతిశతకము మృదుమధురపదగుంఫితమై చదువరులకు సంతసము గలిగించుచున్నదనుటకు సందియములేదు. ప్రభుత్వమువారిచేఁ బ్రాథమిక పాఠశాలలలో నిది పఠనీయముగా నియమింపఁబడుటయే యిందులకుఁ బ్రబల సాక్ష్యము. మొదటికూర్పు 2000, రెండవకూర్పు 5000 ఖర్చయి, మూడవకూర్పు మరల 5000 ముద్రింపింపఁబడిన దీని ప్రాశస్త్యము వేఱుగా వ్రాయవలసిన పనిలేదు. దిగువపద్యంబులు తిలకించి దీని తత్త్వమును గ్రహింతురుగాక.

కం. వేసమునకేమి ? చాకలి నాసించిన వలువ లెట్టివైన లభించుఁ గా.
భాసురమగువిద్య చిరాభ్యాసంబునఁగాక యెరవు కబ్బునె సుమతీ !

కం. ఉన్నతమగుస్థానంబున నున్నంతనె నీచపురుషుఁ డుత్తముఁడగునా?
మిన్నంటుమేడకొనఁ గూర్చున్నను గాకంబు ఖగవరుండౌ సుమతీ!

కం. నీతులు పదివేల్ నేర్చినఁ జేతోగతిమాఱుదెందుఁ జెనటులకు. యుగ
ప్రాతంబు నీట నున్నను రాతికి మెత్తందనంబు రాదుర సుమతీ !

సీతాకల్యాణము — ఇది ౫౦వ స్నేహలతాకవితాసంఘపుష్పము. గ్రంథకర్తలు వాజపేయయాజుల రామసుబ్బారాయ వెంకటనారాయణ సోదరకవులు. స్నేహలతాకవితాసంఘాధ్యక్షులు. కొల్లాపురము. జటప్రోలుసంస్థానము. మూల్యము 1-0-0. లోకోత్తరచరిత్రుఁడగు శ్రీరామచంద్రుని గథానాయకునిగాఁ గైకొని కవిసోదరులు కల్యాణకావ్యమును గావించిరి. రచన రమణీయము. స్వభావోక్తిసము

పేతము. ద్రాక్షాపాకము. ఇప్పటివారిలో నింత సరళముగా నిట్టి యనర్గళధారతోఁ గావ్యరచన గావింపఁగలవారు కడు స్వల్పము. కథానాయకుని గన్నభూమియైన యార్యావర్తపు టౌన్నత్యము ననేకపద్యములతో వర్ణించి దేశభక్తి దెలుపఁబడి యున్నయది. ఇయ్యది మూఁడాశ్వాసముల ప్రబంధము. ప్రబంధములలో వస్తువున కన్న వర్ణనావైశద్యమే యతిశయముగ నుండును. ఇందు వస్తుతత్త్వము విస్మరింపఁ జేయు వర్ణనబాహుళ్యము విడువఁబడుట గమనింపవలసిన విషయము. ఈసోదరకవులలో రామసుబ్బారాయుఁడు బి యే గారు జ్యేష్ఠులు. వీరు జటప్రోలుసంస్థానప్రభువులగు శ్రీ సురభిలక్ష్మణరావుబహదరుగారిచేఁ జిరకాలముక్రిందఁ గొల్లాపురమునకుఁ దోడ్కొనివచ్చి స్వాంగ్లపాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయులుగ నుంచుకొనఁబడి కుమారరాజుగారికి గురువులుగా నుండుచుండిరి. గ్రాడ్యేటులే కాక కవులుగూడ నైయుండుటంజేసి యాంగ్లవిద్యాధ్యాపనమే కాక కవితావ్యాసంగమును గడుఁ గావించుచుండుటయు లక్ష్మణరావుగా రున్నంతవఱకు వారును, దరువాతఁ దద్ధర్మపత్నియగు రాణి రత్నాంబగారును, గ్రమముగా యువరాజుగారును బ్రోత్సాహకులగుచు వచ్చిరి. అందు యువరాజుగారి యోగ్యత యేమనిచెప్పనగు? వారి కింకను మైనరు వెళ్ళియు వెళ్ళని స్థితిలో నున్నది. పట్టాభిషేకము భవితవ్యము. అంతబాలురైన యయ్యువరాజుగారి యాంధ్రభాషాభిమాన మత్యంతము కొనియాడఁదగినది. రామసుబ్బారాయుఁడుగారు ప్రత్యేకించియు సోదరులు కలసియు నిదివఱకు వ్రాసి ప్రకటించినవి చిఱుతకబ్బములు కాని మఱింత గురుత వహించినవి కావు. అవి యన్నియు నవలోకించి యీసోదరులవే కాక యాత్మీయయశోవల్లికలం గూడ నఖిలదిశలం బ్రాఁకించుట కయ్యువరాజుగారు పెద్దప్రబంధమే వ్రాయ సోదరులఁ బురికొల్పి తమరే కృతిపతులయి ధన్యతం గాంచుటకన్న నెక్కుడు యోగ్యత యింక నేమికావలె? ఇట్టి సత్ప్రభువులు కృతిపతులగుటచేత నేమి కవుల ప్రతిభావిశేషంబున నేమి యీసీతాకల్యాణ మెంత శ్రావ్యముగాఁ గుదిరినను గుదిరినదే. పుస్తకము చేతఁబట్టినఁ బూర్తిగాఁజదువువఱకు భోజనమునకుఁగూడ లేవనీయదు. శతం విహాయ భోక్తవ్యమను శాస్త్రోక్తియైనను స్మరణకు రానీయదు.

సీ. తెలిదామరలతోడఁ దులఁదూఁగి కారుణ్య
రస మొలుకుచుండు నేత్రములవాఁడు
కరికరోపమములై కడు బలిష్ఠంబులై
యొప్పు నాజానుబాహువులవాఁడు
లక్ష్మీనివాసమై లావణ్యరూపమై
క్రాలువిశాలవక్షంబువాఁడు
సాంద్రమై తరళమై శరదిందుచంద్రికా
సమమైనమందహాసంబువాఁడు

మత్తసామజగమనసంపత్తివాఁడు
డంబు దళుకొత్తు కంబుకంఠంబువాఁడు
పిడికిట నడంగు సింగంపునడుమువాఁడు
నగుచు రాముండు మించె బాల్యంబునందు.

వీరశృంగారములలో విహరించుచు నర్థశబ్దాలంకారములతో హావణించుచు మృదుమధురపదభూయిష్ఠమై యచ్చునకుఁ జూపఁబడిన మనవారి యీపద్యమునుబట్టి గ్రంథప్రాశస్త్యమును గనుగొనవచ్చును. వాల్మీకిరామాయణము ననుసరించి సంగ్రహముగా బాలకాండముమాత్రమే సీతాకల్యాణముగాఁ జిత్రింపఁబడినది. తక్కిన కాండల కథలును దత్కవులు తత్తన్నామములతోఁ బొత్తములుగా వ్రాయుటకుఁ బూనుదురనియు రాణి రత్నాంబగారును రాజకుమారులును రామసుబ్బారాయుఁడు గారిని బ్రోత్సహింతురనియుఁ దలంచుచున్నవారము. పోషకుల భాషాభిమానము పొగడఁదగియున్నది.

మొదటినుండియు నేతత్సంస్థానికులు భాషాభిమానులనుటకుఁ జంద్రికాపరిణయమే చాలినంత సాక్ష్యము. అభినవసరస్వతి యారంభదశలో నాత్మీయసంస్థానమున కనుపఁబడుటయు ౫౦ రూపాయ లద్దానికి వెంటనే పంపించిన వెంకటలక్ష్మారావుబహదరుగారి విద్యాభిమానము వేఱుగాఁ జెప్పవలసి లేదు. పరంపరాగతమగు భాషాభిమానమును బండితబహూకారమును బరిపాలించు రాజకుమారుని భోజరాజుంబోలెఁ బొగడఁదగియున్నది.

ఉ. పూఁచియుఁ బూయకుండఁగనె పూవులఁ దావులు తోఁచుమాడ్కి నీ
రాచకొమారుఁ డింకను దిరంబుగ గద్దియ నెక్కి యెక్కకే
ఏచి తెలుంగుబాస రచియింపుఁడు కబ్బము లేను మిమ్ములన్
బ్రోచెద నంచుఁ జాటెఁ గవిముఖ్యుల; కేమికొ యింత మాకిఁకన్ ?

---

కామవిలాసము — ఇది స్నేహలతాకవితాసంఘము 44వ పుష్పము. గ్రంథకర్త విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రి యమ్ యే గారు. వెల 0-8-0. ఆంగ్లేయకవులలో నగ్రస్థాన మలంకరించిన మిల్టన్ గారు రచించిన కోమసునాటిక దీనికి మాతృక. కోమసు మంచి శ్రావ్యకావ్యమని యాంగ్లేయకవులచే నభినుతింపఁబడినది. సౌశీల్యమునకును సత్ప్రవర్తనమునకును దైవసహాయ మెల్లపుడును సన్నిహితమై యుండుననియే యిందలి సారాంశము. కామునిచేఁ జిక్కిన సుశీల తుదకు ధర్మదేవతచే నధర్మపాశములనుండి విడిపించి రక్షింపఁబడిన కథ యిందు చరితము. నీతికి నిధానము. ఆనీతిని బోధించుటకే కోమసును గామవిలాసమని యాంధ్రభాషలోనికి మార్చి విశ్వనాథశాస్త్రిగారు విరచించిరి. ఇయ్యది పాశ్చాత్యగ్రంథమునకుఁ బరివర్తనమైనను వారి సంప్రదాయములను బ్రవర్తనములను నభిరుచులనే జొనిపియుఁ గ్రీస్తునే

పరిశంసించి కృష్ణాదులు గీర్తింపకయు పొందవుల చే నాంగ్లేయవాసనలే యాఘ్రాణింపఁజేయక శాస్త్రిగారు సనాతనమతతత్త్వమునే చవిచూపి భాషా వినిమయముతో పాటు రసవినిమయముగూడ రచనలోఁ గనఁబఱచిరి. పెక్కేల! పాశ్చాత్య గాథ భారతగాథగనే పరివర్తితము. ఇది నాటిక కనువాదమైనను గద్యపద్యాత్మకము కాదు. ద్విపదయుఁ గాక మంజరియుఁ గాక యేదో యొక మూలగొట్టువృత్తమాలిక. అయినను గానమునకుఁ గర మనుకూలము. కవిత్వము మృదుమధురపద భూయిష్ఠము. మచ్చున కిందలి కొన్ని పంక్తులు దిగువఁ దిలకింతురుగాక.

రక్తి సీతను బట్ట రావణాసురుని
ముల్లోకముల నేలు మూలబల మడఁగె.
సానుజసుతుఁడుగాఁ జచ్చె యుద్ధమున.
నీచకిరాతుండు నీటుకాఁ డగుచు
దమయంతిచూపులో దగ్ధమై పోయె.
కేసరికి సరియైన కీచకుని శక్తి
రమణి ద్రౌపదిఁబట్టి రాళ్ళ పాలాయె ...
దుర్జాతి యెల్లపుడు దోషదూషితము ...
తాఁ ద్రవ్వగోతినే తాఁ గూలు శఠుఁడు ...

---

## —♦ దేవాలయప్రవేశము ♦—

(గోవిందరాజు హరిశ్చంద్రరావుగారు)

ఈశానగురుదేవపద్ధతియందే నాల్గవ సంపుటమున

శ్లో. తద్వత్త్వావ జపిత్వాతు స్వర్ణం దద్యాచ్చ శాంతయే
ప్రాసాదే ప్రాంగణేవాపి మృతేవా రుధిరక్షతే
మూత్రవిష్ఠాదిసిక్తేవా శ్వోదక్యాసూతికాదిభిః
చండాలైర్వా సృగాలైర్వా గృధ్రోలూకైశ్చ గర్దభైః
ప్రవిష్టేచ ప్రసూతేచ ప్రాయశ్చిత్తం నిగద్యతే.
తత్ర తాంతాం భువం ఖాత్వా ద్విహస్తం పరితోప్యథ
ఉద్ధృత్య తాం మృదం త్యక్త్వా గోకరీషాగ్నినా దహేత్.
తద్భస్మచ పరిత్యజ్య గోమూత్రేణాభిపూర్యతు
విప్రపాదాంబుతీర్థాద్భిః పంచగవ్యేనచ క్రమాత్.
గోభి రాక్రామయే చ్ఛిష్టమృద్భి రాపూరయేదపి

ప్రపాంవా మండపం కృత్వా బ్రాహ్మణాం స్తత్ర భోజయేత్.
దక్షిణేర్ధేందుకుండేగ్నౌ సంస్కృతే చాహితే శివే
ఔదుంబరీ మపామార్గసమిధంచ ఘృతం చరుం
సిద్ధార్థాంశ్చ క్రిమాదష్టసహస్రంతు పృథక్పృథక్
ఈశాన్యైర్గృహుభిర్హుత్వా పున శ్శాలీం స్తిలాన్ యవాన్
ముద్గాన్ సమధురా దూర్వాః పాయసంచ చరుం క్రమాత్
బ్రహ్మభిశ్చైవ మూలేన గాయత్ర్యా జుహుయాత్పునః.
అంగానాం తద్దశాంశేన సర్వద్రవ్యైర్జుహోతిచ.
అనివారిత మన్నాద్యం దత్వా క్షేప్యో బలిర్నిశి.
శ్రీప్రోక్షాదిస్నపనేనాపి స్నపయిత్వోపపత్తితః
దక్షిణాశ్చ ప్రదేయాస్తాః దత్వా పూజాం ప్రవర్తయేత్.

(606, 607 పుటలు)

(ప్రాసాదముగాని ప్రాంగణముగాని మరణముచే దూషితమైనను రక్తసిక్తమైనను మూత్రవిష్ఠాదియుక్తమైనను శ్వానరజస్వలాసూతికాదులచేఁగాని చండాలురచేఁగాని సృగాలముచేఁగాని గృధ్రోలూకములచేఁగాని గర్దభములచేఁగాని ప్రవేశింపఁబడినను బ్రసూతిచేఁ గళంకితమైనను జేయవలసిన ప్రాయశ్చిత్తము వక్కాణింపఁబడుచున్నది. ఆయాభూమిని ద్విహస్తపరిమితమగునట్లు త్రవ్వి యామట్టి నెత్తివేసి గోకరీషాగ్నిచే దహింపవలెను. అథిస్థమును బరిత్యజించి గోమూత్రముచే నభిపూరణ మొనరింపవలెను. బ్రాహ్మణపాదతీర్థజలములచేతను బంచగవ్యముచేతను వరుసగా నది కావించి గోవులచేఁ ద్రొక్కింపవలెను. అదియునుంగాక యష్టమృత్తికలతో నభిపూరింపవలెను. మఱియు, ప్రపనుగాని మండపమునుగాని నిర్మించి బ్రాహ్మణుల నట భుజింపఁజేయవలయు. పిమ్మట దక్షిణమున నర్ధచంద్రాకారముగల కుండమునందుఁ బవిత్రమై శుభకరమైన యగ్నిని బ్రతిష్ఠించి యౌదుంబర్యపామార్గసమిధ్ఘృతచరుసిద్ధార్థములను వరుసగాను బ్రత్యేకముగాను బెక్కులైన యీశాన్యమంత్రములతో హోమము చేయవలెను. మఱియు, శాలిధాన్యమును నువ్వులను యవలను ముద్గములను జక్కని దూర్వాంకురములను బాయసమును జరువును యథాక్రమముగా బ్రహ్మమూలగాయత్రీమంత్రములతో హోమము గావింపవలెను. అంగముల విషయమునఁ దద్దశాంశమున నుదాహృతములైన సర్వద్రవ్యములతో హోమము కర్తవ్యమగుచున్నది. అడిగినవారికి లేదనక యన్నాదులను బెట్టి రాత్రి బలియొసంగవలెను. శ్రీప్రోక్షాదిస్నపనముచేనయినను యథోపపత్తిగా స్నపనము గావించి దక్షిణలిచ్చి పూజను (బ్రారంభింపవలెను) మఱియు నీగ్రంథమునందే 607 వ పుటలో నిట్లు లిఖింపఁబడియున్నది.

శ్లో. లింగే పాషండిచండాలశ్వాదిస్పృష్టేభిచారకైః
మంత్రైర్విన్యస్తేచ పూర్వోక్తం గోసంచారాది కర్మయత్
సర్వంకృత్వాధ కోశంతు కృత్వా యజ్ఞతరూద్భవం

(లింగము పాషండులు చండాలురు శునకములు మొదలగు ప్రాణులచే స్పృశింపఁబడినను నాభిచారికమంత్రములతో నర్చింపఁబడియున్నను బూర్వమునఁ జెప్పఁబడిన గోసంచారాది కృత్యము నొనరించి యజ్ఞతరూద్భవమగు కోశమును జేసి వక్ష్యమాణమైన సంస్కార మొనరింపవలయును) ఈగ్రంథము ముఖ్యముగాఁ గేరళదేశమున దేవాలయాదివిషయములందుఁ బ్రమాణముగా గ్రహింపఁబడుచున్నది.

శ్లో. చోరచండాలపతిత శ్వోద శ్వాదిప్రవేశనే
శవాద్యుపహతౌచైవ పూజావిచ్ఛేదనే తథా
స్నాపనోక్తేన మార్గేణ ప్రాయశ్చిత్తక్రతి స్తథా.

(తంత్రసారము తృతీయాధ్యాయము)

(చోరులు చండాలురు పతితులు శునకములు మొదలగు ప్రాణులు దేవాలయమును బ్రవేశించినను శవాదిసంబంధము సంభవించినను బూజావిచ్ఛేదము గలిగినను స్నపనవిధిప్రకారము ప్రాయశ్చిత్త మొనరింపవలయును.) (స. శే. ష. ము)

---

## అబిస్సీనియా యుద్ధరహస్యము

ఇటలీ మనోరథము సిద్ధించినది. ఏడుమాసములలోఁ దనకంటె రెండింతల వైశాల్యముగల యబ్సీనియారాజ్యమును బూర్తిగాఁ గబళించివైచినది. అబ్సీనియను ప్రజలు లోలోనఁ గుందుచుందురుగాక. నానారాజ్యసభ పరిభవముచేఁ దలవంచుకొనునుగాక. ఈ యిరువదవశతాబ్దమునఁ బట్టపగ లిట్టి బందిపోటుదొంగతనమా యని లోకమంతయు హాహాకారము సలుపుచుండుఁగాక. ఏమైనను నిటలీ కఖండ విజయము చేకూరినది. ఇటలీరా జబ్సీనియాకుఁ జక్రవర్తియైనాఁడు ... ఆఫ్రికా ఖండములో నిఁక స్వతంత్రరాజ్యమని చెప్పుకొనఁదగిన భూభాగ మిసుమంతయు లేదు. ఆ విశాలఖండములో నేమూలఁజూచినను నేతీరమునఁ దిలకించినను యూరపియనుపతాక తప్ప నింకొకటి కన్పట్టదు. 1936 లో నాఫ్రికావిషాదచరిత్రయందుఁ దుదియధ్యాయము ముగిసినది. ఇటలీవారి సంకల్ప మీనాఁటిది కాదు. గతించిన యూరపియనుమహాసంగ్రామానంతర మింగ్లాండుఫ్రాన్సు లిటలీ నేనాఁడు చిన్నచూపుచూచెనో నాఁడే యీసంకల్ప మంకురమైనది. ఇటలీ జర్మనీ నోడించుటకు యావచ్ఛక్తి మిత్రమండలికిఁ దోడ్పడినది. ఇటలీయే జర్మనీ పొట్టలో బల్లెమువలె నుండక తటస్థముగనైన నుండినయెడల నాయుద్ధము మఱియొకవిధముగ ముగిసెడిదనుటకు సందియములేదు. కాని జర్మనీయెడల నసూయచేతనో యింగ్లాండుఫ్రాన్సు లపై నభిమానము వహించియో యేఫలము నాశించియో యిటలీ జర్మనీతోఁగల

చిరకాలస్నేహమును విడనాడి, యుద్ధాగ్నిలో దుమికెను. మిత్రమండలికి విజయమును గూర్చుట కెంతసైన్యమునో కోలుపోయెను. ధనమునంతను వ్యయపఱచుకొని తుదకు ఋణములపాలుకూడ నయ్యెను. ఇటలీతోడ్పాటుతో మిత్రమండలికి విజయము చేకూరెను. కాని యుద్ధానంతర మిటలీమాట తలపెట్టినవా రెవరును లేరు. ఇటలీకిఁ దూర్పువైపున నంటియుండిన చిన్న చీలిక యిటలీలోఁ గలిపివేయఁబడినమాట నిజము. కాని యిటలీ చూపిన త్యాగసాహసముల కది ప్రతిఫలముకాదు... ఇటలీని జ్ఞాపక ముంచుకొనలేదు. బ్రిటీషుఫ్రెంచిసామ్రాజ్యముల వైశాల్య మెంతయో పెరిగినది. కాని యొక్క ... అధికారమునైనను నిటలీ కొసఁగలేదు. యుద్ధమధ్యమున మిత్రమండలివా రిటలీ కెన్నియో వాగ్దానములను జేసిరి.

అబీసీనియాపై రాజ్యాధికారమును స్వీకరించుట కిటలీకి స్వేచ్ఛ యొసఁగఁబడుననిరి. కాని యేవాగ్దానముఁ జెల్లింపఁబడలేదు. అంతటితో నిటలీకి మిత్రమండలిపై స్పర్థ యంకురించినది. ఏనాఁటికైనను నబీసీనియాను స్వతంత్రముగ వశపఱచుకొని తనయాధిక్యమును వెల్లడిపఱచుట కిటలీ శపథముపట్టినది. అప్పటికి ...యూరపులో శాంతి నెలకొనినది. ఫ్రాన్సింగ్లాండులు విజయఫలము ననుభవించుచుండెను. కాని యిటలీమాత్రము నిర్వీర్యమయ్యెను. వర్తకవ్యాపారములు క్షీణించెను. బొక్కసము రిక్తమయ్యెను. ఋణదాతలు ఋణముల తీరుమానము నిమిత్త మొత్తిడి చేయుచుండిరి. ఇటలీలో నొకవిధమైన యభావము నైరాశ్యముఁ గృపణత్వము నేర్పడినవి. ప్రజలలో నలజడి హెచ్చ నారంభించెను. ఇటలీ యడుగంటుటతో తిరిగి విజృంభించుటతో విషమసమస్య సంఘటించినది. నలువైపులఁ జీఁకట్లలముకొనినవి. ఈతమస్సులను ఛేదించి యిటలీ నుద్ధరింపఁగలవా రెవరు? ... ఏజాతియైనను వీర్యవంతముగ నుండవలెనని నభిమానము నహంకారముఁ బూరించుకొనవలెను. యుద్ధదేవత నుపాసింపవలెను. జిగీష తీవ్రము కావలెను ... ఇటలీ యలనాఁటి రోమకసామ్రాజ్యమువలె విజృంభింపవలెను. సామ్రాజ్యదురాకాంక్షను బ్రజలలోఁ బురికొల్ప నారంభించెను. రోమనుఖడ్గము నుపాస్యదేవతగాఁ బ్రతిష్ఠించెను. తటాకము గట్టులను ఛేదించుకొని పొంగి పొరలు జలసమృద్ధివలె నిటలీ జనభరితమై పరిసరములను దాఁటి మధ్యధరాసముద్రము నుల్లంఘించి యాఫ్రికనుభూములను ముంచివేయవలెననెడు దురాకాంక్షఁ బ్రజ్వలింపఁజేసెను ... 14 సం॥ క్రిందటనే యబీసీనియాపట మిటలీరంగులలోఁ జిత్రించి గ్రామగ్రామమునఁ బట్టణపట్టణమునఁ బ్రదర్శించెను. ఎంద ఱిటాలియనుశాస్త్రజ్ఞులు పరిశోధనపేరటఁ గ్రైస్తవమతబోధపేరట వ్యాపారముపేరట నబీసీనియాకు వెడలుచుండిరో తెలియదు. ఎందఱో వైజ్ఞానికు లబీసీనియాకుఁ బోయి కొండకొండ లోయలోయఁ బరిశీలించి వచ్చిరి. అబీసీనియా భూగర్భమునం దెట్టిలోహములు కలవో తెలిసికొనిరి. ఏయేప్రదేశములయం దేయే పంటలు పండునో పరిశీలించిరి. ఏప్రాంతములలోఁ దెల్లజాతులు నివసించుట కనువైన శీతోష్ణము ఉండునో కనుగొనిరి ... వారిసైనికసంపత్తులుఁ గోటల రహస్యమార్గములు దాఁడి వెడలుట కనుకూలములైన నిగూఢపథములు సర్వే చేయఁబడినవి ...

ఇటాలియనుపరిశోధకులు 14 సం॥ నుండియుఁ జేయుచున్న పని యిది. యుద్ధసామ
గ్రిని గూర్చుకొనుటలోఁగూడ నిటలీ యపూర్వమార్గము ద్రొక్కినది. ఇటలీ కాఫ్రిక
ఖండములో నిదివఱకే యెరిత్రియా సోమాలీలాండు ననుదేశములు స్వాధీనములై
యున్నవి. అవి యంతగ ఫలప్రదములైన ప్రదేశములు కావు. కాని యచ్చట నే
జాతు లెన్నియో కలవు. వీరెల్లరు నాఫ్రికను లగుటచే నబ్సీనియనుకొండల న
లీలగ నెక్కఁగలవారు. అచ్చటి శీతోష్ణస్థితుల కభ్యాసపడినవారు.

వారి కాదేశభాషాపరిచయ ముండుటచే నబిసీనియనుల యాచారవ్యవహా
ములను నభ్యాసములను బలాబలములను బాగుగా గుర్తెఱిఁగినవారు. వీరందఱుఁ బద
సం॥నుండియు నిటాలియను సేనానాయకులచే నాధునిక యుద్ధవిద్యయందు సుశిక్షిత
లగుచుండిరి. వీ రిదివఱకు నెట్టివృత్తియు వ్యాపారమును లేనివారగుటచే సైన్యము
లలోఁ జేరుట కుత్సాహపడుచుండిరి. ఈ యబ్సీనియను యుద్ధములో విశేషముగఁ
బాల్గొనినది యీ ... ఆఫ్రికనుజాతివారు. ఇటలీవారు సేనాపతులుగ నుండి యుద్ధ
మును దూరమునుండి నడుపుచుండిరే కాని యెక్కువ యుద్ధములో మునిఁగి పడి
నది యీ యాఫ్రికనులేయని తెలిసికొనినయెడల నిటలీవారి రణనీతిరహస్యము కొంత
బోధపడును. ఇందుఁ జెల్లవారి రక్త మెక్కువగఁ జిందలేదు ... ఆఫ్రికనులే తమ
రక్తధారల నోడ్చి యబ్సీనియాను జయించిపెట్టిరి. రూపురేఖలలో వీరికిని నబ్సీని
యనులకును విశేషభేదము గన్పట్టదు. యుద్ధమునకుఁ బూర్వమే యెందఱో ...
గూఢచారులై యబ్సీనియాలోఁ బ్రవేశించి లంచము లిచ్చి యబ్సీనియను ప్రజలను
జీలఁదీయుచుండుటయే కాక వారి సైనికవ్యూహముల రహస్యముల నన్నిటి నెప్పటి
కప్పుడు తెలిసికొనఁగలుగుచుండిరి. కొందఱు సాక్షాత్తబ్సీనియను సైన్యములలోఁ
గూడఁ జేరి లోగుట్టులను గనిపెట్టుచుండిరి. ... ఇటలీ గతయుద్ధములోఁ బాల్గొని
యుండుటచే నందలి లోఁతుపాఁతు లన్నిటిని బాగుగ గ్రహించెను. యుద్ధ మెట్లు
పరిణామము నొందుచున్నదియు లెస్సగ నూహింపఁగలిగెను. అందులో నబ్సీనియా
యట్టి పర్వతప్రాంతము. అరణ్యమయము. కేవల సైన్యముల నడకలచే ముందఱికి
సాగుటకు వీలులేని ప్రదేశము. ఆకాశయానముల దాడితోనే యీ యుద్ధము జయ
ప్రదము కాఁగలదని యూహించి వైమానికబలమును వృద్ధిపఱచుకొనుటయందే
తక్కిటి యూరపియను రాజ్యము చేయని ప్రయత్న మిటలీ కావింపఁగలిగినది. విమా
నములను నడపుటలో నిటాలియను వైమానికు లత్యద్భుతమైన నైపుణ్యమును సంపా
దించిరి ... ఈవిమానము లెట్టి ద్రెడ్నాటులపైననైనను బాంబులను గురిపించి
వానిని సముద్రములో ముంచివేయఁగలవు ...

ఈ వైమానికదళమే యబ్సీనియాదండయాత్రయందు జయము గల్పించిన
మాట వాస్తవము. ఈవిమానదళమునకు విషవాయుప్రయోగముగూడ బాగుగఁ దో
డ్పడినది. ఎంతశత్రువర్గ ముండిన నేమి? విమానములనుండి విషవాయువుల నగ్నిగోళ
ముల విసరునప్పుడు నిలువఁగలిగిన దెవరు ? గ్రామములు భస్మీపటలములైనవి ...
సైన్యములన్నియు మిడతలదండువలె మలమల మాడిపోయెను. ... ఆకాశదళము

లతోఁ బోరాడలేని రాజ్యమునకు స్వాతంత్ర్యము దక్కదని యిటలీ ... ప్రకటించెను. ఇంగ్లాండువంటి యురపియను రాజ్యములే యిటలీవారి వైమానికవిజృంభణమున కచ్చెరు వొందుచుండ నాధునికరణవిద్యయం దెంతయో వెనుకపడియున్న యబ్సీనియా తుత్తునియలై పోవుటలో నాశ్చర్యమేమి! ... దేనికైనను గాలము ప్రధానము ... కాలము పరిపక్వము కాకుండఁ జేయఁబడు యుద్ధముల కపజయము వాటిల్లక తప్పదు. యురపియను పరిస్థితు లిటలీకిఁ జాల ననుకూలములైనవి...హిట్లరు జర్మనీలో సైనికవిజృంభణము గావింపఁ బ్రారంభించినప్పటినుండియు నింగ్లాండు ఫ్రాన్సు లిటలీని దువ్వ నారంభించినవి. ఇటలీ నేదోవిధముగ సఖ్యపఱచుకొనని యెడల జర్మనీపక్షము తిరిగిపోవునేమో యనుభీతి కలదు. ముఖ్యముగ ఫ్రాన్సిటలీనే నమ్ముకొనియున్నది. జర్మనీభీతి యున్నంతకాలము ఫ్రాన్సుఁ దద్ద్వారమున నింగ్లాండుఁ దనతో వైరము పెట్టుకొనుటకు సాహసింపవను విషయము నిటలీ బాగుగ గ్రహించినది. ఇటలీ యబ్సీనియాపై యుద్ధసన్నాహము గావించుచుండినసంగతి ఫ్రాన్సింగ్లాండులకుఁ దెలియకపోలేదు. అబ్సీనియాలో ఫ్రాన్సుకు రైలుమార్గము కలదు ... ఫ్రాన్సింగ్లాండు లిటలీతో నొక యేర్పాటునకు యుద్ధమునకుఁ బూర్వమే వచ్చినవిషయము లోకవిదితము ... అబ్సీనియను దండయాత్ర కడ్డురాని యెడల వారికిఁగల హక్కులను భద్రపఱచుట కిటలీ ముందుగ నభయహస్త మిచ్చి ...యుండును ... ఫ్రాన్సింగ్లాండుల వైఖరి పూర్వముకంటెఁగూడ మాఱిపోయెను.

ఇటలీస్నేహము ఫ్రాన్సింగ్లాండుల కెంతయవసరమైనదియు జర్మనీసంగతి గమనించినఁగాని బోధపడదు ... ఇంగ్లాండుఫ్రాన్సుల కిటలీ కీలకమై తన యిచ్చ వచ్చినరీతి నాడింపఁగలుగుచున్నది ... యురపు శాంతిభద్రము లిటలీపై నాధారపడియున్నవి. ఫ్రాన్సింగ్లాండులు నమ్ముచుండినంతకాల మిటలి యథేచ్ఛగఁ బ్రవర్తింపఁగలదు ... అబ్సీనియా యాఫ్రికాలోనిది కాని యురపులోనిది కాదు. ఆ యబ్సీనియాయైన నింతవఱ కేయురపియను రాజ్యము క్రిందను లేదు. యురపియను క్రిందలేని యాఫ్రికను దేశము పోరంబోకగనే భావింపవలసియుండును. ఆఫ్రికా ఖండము యురపియను జాతుల భుక్తికొఱకు సృష్టింపఁబడినది. ఫ్రాన్సు నింగ్లాండు హాలెండు బెల్జియము మొదలగుదేశము లవా రందిన భూభాగముల స్వాధీనము చేసికొనిరి. ఇఁక నెవరికి నందకుండఁ బోరంబోకవలె మిగిలిపోయినది యబ్సీనియా. ఈ యబ్సీనియాకు నేఁ డిటలీరాజు నాథుఁడైనాఁడు ... ఫ్రాన్సు నింగ్లాండు స్వత్వేమము గోరిరైయెనను దొందరపడనందుకు మనము సంతసింపక తప్పదు ... యురపియను పరిస్థితులు నానాఁటికి విషమించుచున్నవి. జర్మనుసమస్యను బరిష్కరింపకుండఁ గాలయాపన చేయుటకు వీలులేదు ... ఒకవైపున రష్యా యపూర్వమైన సైనికవిజృంభణమునకుఁ బూనుకొనినది. జపానుకును రష్యాకును నొకవేళ యుద్ధమే పొసఁగిన యూర పేమిచేయునో తెలియదు. జర్మనీ రష్యాపైఁ గసిపట్టియున్నది. ఇదియే సమయమని రష్యా తూర్పువైపున రణభేరి మ్రోఁగింపవచ్చును ... జర్మను లంత నెట్టివిప్లవమునకుఁ గారణభూతులయ్యెదరో యెవరు చెప్పఁగలరు! ... యూరపి

యను రాజ్యతంత్రజ్ఞు లిపు డబ్సీనియాకొఱకు విలపించుచు నుండఁజాలరు. యూరపుఖండము నేఁ డగ్నిపర్వతమువలె బీట్లువాఱియున్నది. దానినుండి కాఱుపొగలు మింటి కెగయుచున్నవి. భూగర్భమున భయంకరములైన ప్రళయధ్వానము లురుముచున్నవి. ఈమహాసంకులము మధ్య నబ్సీనియనుల హీనదీనస్వరముల వినువా రెవ్వరు ? ... ఇఁక హిట్లరునాటకము ప్రారంభమగును. హిట్లరు తలలో నెన్నియూహ లున్నదియు... ఒక్కొక్కటే క్రమముగ బయటఁబడుచున్నవి ... ఫ్రాన్సు మాఱుపలుక లేదు. పెద్దసామ్రాజ్యములు కొంతవఱకైనను ధర్మముకొఱకు స్వప్రయోజనముల వదలుకొనినఁగాని యూరపుశాంతిభద్రములు స్థిరపడ నేరవు ... ఫ్రాన్సు రష్యాతోఁ బ్రత్యేకముగ నొడంబడిక చేసికొనుట జర్మనువైరము మఱింతతీవ్రమగుటకుఁ గారణ మగుచున్నది. ఇఁక వెనుకటి త్రోవలు పనికిరావు.

## —* విజయనగరము *—

(వారణాసి శ్రీనివాసరావు, యమ్ యే గారు)

మహారాష్ట్ర కాకతీయ భల్లాణ సామ్రాజ్యములక్రింద సుఖముండిన దక్షిణహిందూస్థానముపై 1293 సం॥ ఒకనాఁడు తురుష్కవాహిని హఠాత్తుగాఁ బడి యోరుగల్లువఱకుఁ బ్రవహించి యాఁగినది. తరువాత 1303, 1306 సం॥ లో నింకొకదారిచూచుకొని 1310 సం॥ మరల బయలుదేరి దక్షిణమున ... రామేశ్వరమువఱకుఁ బ్రవహించి విరమించినది. ఈప్రవాహములోఁ బై 3 సామ్రాజ్యములు కొట్టుకొని పోయినవి. ఆనీరము తీయునాఁటికి దక్షిణహిందూస్థాన మంతయుఁ జిన్నచిన్న స్వతంత్రరాజ్యములతో నిండియున్నది. సామ్రాజ్యముల మార్పు దక్షిణహిందూస్థానమున వింత కాదు. దానిచరిత్రయంతయు క్షణభంగురసామ్రాజ్యసంస్థాపనములతో నిండియున్నది. క్రీ॥ శ॥ 600 మొదలుకొని 1200 వఱకుఁ జాళుక్యులుఁ బశ్చిమచాళుక్యులుఁ దూర్పుచాళుక్యులు రాష్ట్రకూటులు మహారాష్ట్రులుఁ గాకతీయులుఁ దలా యొక షుమారు 200 సం॥ ఈసామ్రాజ్యక్రీడ సలిపిరి. కాని యాక్రీడాధోరణి యెట్టిదైనను బ్రజలకుమాత్ర మేలాటియుపద్రవము సంభవింపలేదు. ఆరాజులందఱు రాజు ప్రజలకైయుండునను నీతిని మన్నించి సర్వదా ప్రజాక్షేమము నారయుచుఁ బ్రజామతధర్మరక్షణమును గావించుచు వ్యవహరించిరి. తురకల దండయాత్రతో నాపరిస్థితులు మాఱిపోయినవి. వారికి విగ్రహారాధన మసహ్యమగుటవలన హిందూదేవాలయములను నేలమట్టము సేయుచు దేవతావిగ్రహములఁ బగులఁగొట్టుచుండిరి. కొన్నిచోట్ల బలవంతము చేసియు మఱికొన్నిచోట్ల ధనవాంఛను బ్రేరేపించియుఁ గొంత హిందూప్రజను మహమ్మదీయమతములోఁ గలుపుచుండిరి. హిందూకులకాంతలకుఁ జెప్పరాని పరాభవము సేయుచుండిరి. హిందువులకు భరింపశక్యముకాని చట్టములతోఁ బ్రభుత్వమును సాగించుచుండిరి. వారి దౌర్జన్యమున నశాంతి ప్రబలి దేశములో వ్యవసాయాదివృత్తులు క్షీణించెను.

వారిధాటి కాఁగలేక కొన్నిపట్లఁ బట్టణములకొలఁదిఁ బ్రజలు వలసపోయిరి. ఇట్టిపరిపాలన ముత్తరహిందూస్థానమున 100 సం॥ పైఁబడి జరిగినది. దానినడి

యాత్రికులవలనను నందుండ దుర్భరమై యిందే తెంచిన రాజవంశజులవలనను రణము నొకవృత్తిగా నవలంబించిన యోధులవలనను జిలువలుపలవలె దక్షిణహిందూస్థానమున వ్యాపింపఁజొచ్చెను. వా రెప్పుడు వచ్చిపడుదురోయని భీతిల్లుచున్న దాక్షిణాత్యులకుఁ బైదండయాత్రలు తటస్థించినపు డెట్లుండియుండునో యూహించుకొనఁ గలరు. వానిలో 3 వ దండయాత్ర వట్టిదండయాత్ర కాక మహమ్మదీయపరిపాలనానుభవమును దక్షిణదేశమునకుఁ గలిగించెను. మాలిక్ కఫూర్ తిరిగిపోవునపుడు మధురానగరములో నొక సేనను సర్దారుని విడిచిపోయెను. ఢిల్లీపట్టణ మతిదూరమగుటంబట్టి కొలఁదికాలములో నాతఁడు తిరుగఁబడి స్వతంత్రుఁడాయెను. నాఁట నుండి ... హరిహరుని కుమారుఁడగు కంపనుఁడు సాళ్వమంగు నంతరించువఱకు నా మధురసుల్తాను హిందువులను బెట్టిన బాధ లింతింతయనరాదు. దేవాలయములు పగులఁ గొట్టుట లోనగు మామూలుధోరణి నటుండనిండు. ఒకపర్యాయము కొన్ని వందల మందిని గట్టుకొయ్యలకుఁ గట్టించి వారిభార్యలయెదుట వారిని జెప్పరానిబాధలఁ బెట్టింపఁగా దానిఁ జూచితిననియు నట్టిక్రూరుల నెందుఁ జూచియెఱుఁగననియు నొక మహమ్మదీయప్రయాణికుఁడు వ్రాసియున్నాఁడు.... అట్టిబాధ లెప్పుడెప్పుడో తటస్థించునవి కాక యనుదినానుభవములనికూడ నతఁడు చెప్పియున్నాఁడు. ... మధురసుల్తానుల కార్యములకు దిక్కుతోఁచక కొట్టుకొనుచున్నవారికి 1326 సం॥ ఢిల్లీ సింహాసనమెక్కిన మహమ్మదుబీన్‌తుఘలకు కోరికలు నూహాపోహలు మరింత భయదాయకములయ్యె. అసలు మహమ్మదీయప్రభువులే విపరీతప్రవృత్తులు. వారిలో నెల్ల మహమ్మదుబీన్‌తుఘలు కృతివిపరీతస్వభావుఁడు. అట్టిపండితుఁడు నట్టిమూర్ఖుఁడు నట్టిజ్ఞాని యట్టి యజ్ఞాని యట్టి దయామయుఁడు నట్టి క్రూరచిత్తుఁడు మఱొకఁడు లోకములో నెన్నఁడును సింహాసనము నధిష్ఠించియుండలేదు. దేవత్వము రాక్షసత్వము సరిపాళ్ళ సమ్మేళనమై యాచక్రవర్తిరూపమును ధరించినవి. అతఁడు రాజ్యమునకు రాఁగానే పూర్వము మధురవఱకు వ్యాపించిన మహాసామ్రాజ్యముపై నధికారము నలాయిం...చి... వ్యవహరింప ... దక్షిణదేశస్థు లుత్తరదేశములోవలెఁ దమదేశములోఁగూడ మతధర్మములకు ముప్పువాటిల్లనున్నదని భయపడిరి. సుల్తాను ప్రయత్నము నెట్లైన నడ్డగింపవలెనని కొందఱు బుద్ధిమంతులకు దోఁచెను. అయినను దాని నాఁగుటెట్లు ? దానికిఁ దగినసాధన మెందున్నది ? ... సుల్తానుతోఁ బోరఁగల శక్తిమంతుఁడు లేఁడయ్యె. దానికిఁ దార్కాణ సుల్తాను రాజ్యమునకు వచ్చినప్పటి నుండియు నానెగొందిరాజగు జంబుకేశ్వరరాయలకు సుల్తాను సేనలకు జరుగుచున్న పోరే కనఁబడుచుండెను. ఢిల్లీకి నింతదూరముగ వచ్చి యుద్ధముసేయుచున్నను నాసేనల నోడించుశక్తి జంబుకేశ్వరునకు లేదాయె. దానితోపాటు సుల్తాను పట్టుదల కూడ నాయుద్ధములో వేద్యమగుచుండె. సుల్తానుకు బాహుద్దీనుగుర్షాస్పను మేనల్లుఁ డొకఁ డుండెను. మేనమామకుఁ దనపై నాగ్రహముగా నతఁడు నిజమరణముకన్న మఱొకటి తనమామను శాంతిపఱుపలేదని యెఱిఁగి ప్రాణములపైఁ దీఁపిచేఁ బలాయమానుఁడయ్యెను. అతనిని బట్టుకొనివచ్చుటకు సుల్తా నొక మహాసైన్యము

పంపెను. బాహుద్దీన్ పాఱిపోయివచ్చి దక్షిణదేశరాజుల శరణువేడెను. ఆసైన్యధాటికి వెఱచి యొకరివెనుక నొకరు శరణొసంగ శక్తిలేదనిరి. అతఁడు చివర కానెగొందిరాజు శరణుఁ జొచ్చెను. శరణాగతత్రాణపరాయణుఁడగు నాభూవరుఁ డాతనికభయమిచ్చి యతనికై వచ్చిన సేనల నాఁగి వానితోఁ బోర నారంభించెను. ఆపోరు కొన్ని సంవత్సరములు జరిగినది. 1334 సం॥ నాఁటికి జంబుకేశ్వరుని బలము తఱుఁగఁ జొచ్చెను. ఎంతకు లొంగకుండుట కాగ్రహించి సుల్తాను మఱొకసన్నాహము చేసి తానే స్వయముగా నానెగొందిపై నెత్తివిడిచెను. బహిరంగరణము లాభింపదని తోఁచి జంబుకేశ్వరుఁడు శరణుచొచ్చిన వానిని గాపాడుఁడని దక్షిణమున నున్న యొక భల్లాణరాజు కడ కంపి వలయుసామగ్రిని గూర్చుకొని యానెగొందిద్వారముల బిగించి పోరుకు సిద్ధపడిరి. మహమ్మదుబీన్ తుఘలకు మును పున్నసేనతోఁ దనతోఁ దెచ్చినసేనను గలిపి యానెగొందిదుర్గమును ముట్టడించెను. కొన్నిమాసములలో జంబుకేశ్వరుని బలము జీర్ణించుటయుఁ గోటలోని సామగ్రి సన్నగిల్లుటయుఁ దటస్థించెను. ఇఁకఁ బోరి ప్రయోజనములేదని గ్రహించి రాణివాసము తురకలచేత నవమానము వొంది మడియుటకన్న నగ్నినుఱికి మడియుట గౌరవమని వారికిఁ జితినుఱుక నాజ్ఞయిడి యది జరిగినవెంటనే ద్వారములు తెఱచి మిగిలినసేనతో వీరావేశముదాల్చి మహమ్మదీయసేనలపైఁ బడి ఘోరయుద్ధముచేసి స్వర్గమున కేగెను. జంబుకేశ్వరుఁడప్పటి పూర్వసామ్రాజ్యసామంతు లందఱిలో నగ్రగణ్యుఁడు. అట్టివానికే సుల్తాను నిరోధించుపని దుర్లభమైనపుడు మిగిలినవారిసంగతి తడవనేల ? ... జంబుకేశ్వరుఁడు మృతినొందినంతనే తురక లానెగొందిలోఁ బ్రవేశించిరి. అందలి గుహలను ధనముకొఱకు వారు వెదకునపు డొకదానిలో వారి కార్గురుమనుష్యులు చేఁజిక్కిరి. వారిలో హరిహరుఁడు బుక్కుఁడు నని కొంచె మీడేరినవా రిరువురు. ఇర్వురు రాజకుమారులు. మిగిలిన యిరువురు కడు వృద్ధులగు రాజవంశజులు. మొదటి యిర్వురు సోదరులు. రాజులు. సంగమవంశజులు. ఓరుగల్లు ప్రతాపరుద్రునియొద్దఁ గొలువుండి వారి మరణానంతర మానెగొందికి వచ్చి జంబుకేశ్వరుని కొల్వులోఁ గోశాధ్యక్షులుగా నుండిరి. యుద్ధము ముగింపఁబోవుకాలమున రాయ లాసోదరుల రావించి తన కేమిసంభవించినను రాజకుమారులను గాపాడెదమని వారివల్ల వాగ్దానము గొనెను. చివర కారాజు ప్రక్కను బోరి మృతినొందవలసినవా రయ్యుఁ జేసినబాస ననుసరించి యాకుమారు లిర్వురను వెంటఁబెట్టుకొని సందడితీఱిన వెనుక నెందైనఁ జననెంచి యాగుహలో డాఁగియుండిరి. సుల్తా నాసోదరులను రాజకుమారులను ఖైదీలుగ వెంటఁగొని యానెగొందిపరిపాలనమున కొకరాణువను మలికునాయబను సర్దారును నియమించి ఢిల్లీకిఁ బోయెను. ఢిల్లీ చేరినంతనే జంబుకేశ్వరునికుమారులకు మహమ్మదీయమతము నిప్పించెను.

ఇట నానెగొందిలోఁ గొంతకాలము సర్వము శాంతముగా జరిగెను. మలికు నాయబు నధికారమును గౌరవించి చుట్టుప్రక్కలవా రణఁగియుండిరి. అట్లుండియుండ నొకనాఁడు హఠాత్తుగా నొక పెద్ద హిందూసేన వచ్చి యానెగొంది ముట్ట

డించెను. ఆసేనఘాటి కౌసర్దారుపరాక్రమముఁ బ్రయత్నము నెంతమాత్రము ఫలింపవయ్యె. అందుమీఁద నతఁడు ముట్టడించినవారి బలమును దెలియఁజేయుచు నేమి యాజ్ఞయని సుల్తానువారికిఁ గబురంపెను. అవర్తమానము వినినంతనే తుఘులకు వజీరుల సభఁజేసి యాలోచనము చేసెను. ఆసభలో "దక్షిణదేశీయులు స్వాతంత్ర్యాభిలాషులు, పరుల పరిపాలనమునకు లొంగరు, జంబుకేశ్వరుకుమారుల నంపుదమన్న వారు మహమ్మదీయులగుట వారియెడల హిందువుల కిష్టముండదు, హరిహరు నానెగొంది సామంతరాజుగ నేర్పఱచి యతనితమ్మునకు మంత్రిత్వ మొసఁగి యిర్వురను వెంటనే యంపుటకన్న నందలి సేనను సర్దారును గాపాడుటకు సామ్రాజ్యగౌరవమును నిలఁబెట్టుకొనుటకు వేఱొండుమార్గము లే" దని సలహావచ్చెను. సుల్తాను దాని కియ్యకొని తగునధికారపత్రముల నిచ్చి యాసోదరులఁ బంపివేసెను. వారువచ్చి జరిగినయేర్పాటు నెఱిఁగించినంతనే హిందువులు ముట్టడిని డించిరి. సర్దారానెగొందిని హరిహరున కొప్పగించి ఢిల్లీ కేగెను. హరిహరుఁడు బుక్కఁడు నానెగొంది పరిపాలనము సేయఁబొడఁగిరి. పైవిషయములు జరుగుచున్నకాలమున నా యానెగొంది ప్రాంతమందలి యరణ్యములో నేఁటి హంపీ శ్రీ కోదండరామస్వామివారి యాలయమున కెదురుగానున్న చక్రతీర్థముకడ మాధవుఁడను నొక భూసురశ్రేష్ఠుఁడు తపమాచరించుచుండెను. ఆయనతండ్రి మాయణుఁడు. తల్లి శ్రీమతి. ఇంటిపేరు సాయణవారు. భారద్వాజగోత్రజులు. బోధాయనసూత్రజులు. యజుశ్శాఖవారు. వారు వేదములకు భాష్యమువ్రాసి కీర్తివహించిన మహాపురుషులు. వారి ప్రతిభ వైదికముననే కాక లౌకికమునఁగూడ భాసిల్లుచుండెను. వారికిఁదెలియని నీతి ధర్మము...లున్నవాయని యనుమానింపఁదగిన మహానుభావులు. వారు జరుగుచున్న యాపద్విషయములను వినుచుఁ జూచుచు వానిని గుఱించి యోజించుచు నుండిరి.

స్వదేశధర్మభక్తిపరాయణులగు నామహనీయులకు మహమ్మదీయోపద్రవము నాఁగుట కొకటేమార్గ మగుపించెను. తాము తపమాచరించుచున్న స్థలము సర్వవిధముల మహత్తుకలదని యందార్యధర్మసంరక్షణ మాదర్శముగఁ గల పట్టణ మొకదాని నిర్మించి దానిపేరిట నొకసామ్రాజ్యము నేర్పఱచిన నాసామ్రాజ్యమే హిందువులఁ గూడఁగట్టి యాయాదర్శము గాపాడఁగలదని తోఁచెను. వారికిని నానెగొందిని బరిపాలించుచున్న హరిహరునకు మైత్రి యుండెను. అందువలన వారి సలహామీఁద నానెగొందికి దక్షిణమున 1336 సం॥ మఱొకపట్టణమును నిర్మింపఁ బూనుకొనెను. కాని పట్టణనిర్మాణము మాటలతో నూహలతో జరుగువిషయము కాదు. దాని కెంతో ధనముకావలసియుండును. ఆనెగొందిధనాగారము లన్నియు నాఁటికి రెండేండ్లక్రిందఁ దుఘులకువశమైయుండుట నం దేమియు మిగిలియుండదు. హరిహరుఁడు రాజ్యమునకు వచ్చి యొక్క సంవత్సరమే యైయుండుటవలన నవకాశములేదు. అయినను విద్యారణ్యునివంటి మహనీయుఁడుండ నేమికొఱంత ? ఆయన మంత్రశక్తిచే 7 గడియలు సువర్ణవర్షమును గురిపించెననియు నట్లురాలినధనముతో హరిహరుఁడు పట్టణమును గట్టించుటేకాక దానిని గొన్ని కోట్లతోఁ దన బొక్క

సములో దాఁచఁగలిగెననియుఁ బెద్ద లందురు. ఆమాటం విశ్వసింపనివారు సర్వశాస్త్రవేత్తయగు నామహాపురుషునకు గను లెందుండినది కని గొనుశక్తిగాని పూర్వులు ధన మెందు భూస్థాపన మొనరించిరో దానిగుఱితించుశక్తిగాని యుండెననియు నేఁడు హేమకూటమునాఁజను పర్వతముననో మఱొకచోటనో యొక గనినిగాని లేనియెడ నిక్షిప్తధనమునుగాని యాయనఘుఁడు హరిహరునకుఁ జూపించియుండ వచ్చుననియు ననుకొందురుగాక. పై రెండువిధములుగూడఁ బురాణములని యెంచువారు "మా యాదర్శమిది, దానిని నెఱవేర్ప మాకుఁ దోఁచినమార్గ మిది, అందుల కింతధనము కావలసియున్నది, అది యందఱికొఱ కేర్పడఁబోవుచున్నది, కాన నందఱు సహాయము సేయవలె" నని హరిహరవిద్యారణ్యు లిరువురుఁ దగురీతి సందేశము లంపినఁ జుట్టుపక్కలనున్న హిందూప్రభువులు ద్రవ్యసహాయముఁ జేసియుందురని యైన నెంచుదురుగాక. ఏదియో యొకవిధమునఁ గావలసిన ధనము సమకూరినది.

పట్టణనిర్మాణమునకు ముహూర్తముపెట్టిరి. ఇది ముహూర్తమని గుర్తించి యంత్రమును దయారుచేసి పునాదితీయవలె. యంత్రనిర్మాణము ముహూర్తనిర్ణయము నొక్కరే యొనరించినచో రెండుపనులుసేయుతొందరలో ముహూర్తవేళఁ దప్పవచ్చును. అందులకై రెండుపనులకును నిర్వహించుట మంచిదని విద్యారణ్యు లెంచి ముహూర్త మిదియని తమకెఱింగించుటకై యొక మహాపండితుని గాశీపట్టణము నుండి రప్పించెను. ఆకాలములో గడియారములు నేఁటివానివంటివి తుచ తప్పకుండ వేళ నిర్ధారణచేయఁగలిగినవి లేవు. కాలనిర్దేశము నక్షత్రగమనమునుబట్టి చేయుచుండిరి. యంత్రనిర్మాణమునకు ముహూర్తము తెల్లవారుజామునఁ బెట్టిరి. కాశీపండితుం డొకపర్వతము నెక్కి నక్షత్రపరీక్ష సేయుచు నావేళకు నొకశంఖమూఁదునట్లును విద్యారణ్యులు తామ్రలోహమును గరఁగించి సిద్ధముగఁ జేతఁబట్టుకొనియుండి యాశంఖధ్వానము వినఁబడినంతనే లోహమును యంత్రపుటచ్చులోఁ బోయునట్లును నేర్పాటుచేసిరి. తెల్లవారుజామైనది. శంఖధ్వానము వినిపించినది. స్వామివారు లోహము నచ్చులోఁ బోసిరి. పోసిన కొన్నినిమిషములకు మఱొకశంఖధ్వానము వినిపించెను. కొంతసేపటికిఁ బండితుఁడు రా వారిది రెండవశంఖధ్వానమని తేలినది. చల్లారినయంత్రమును బరీక్షింపఁగా దానిలో రెండుంబాతిక బీటికలు పడియుండెను. విద్యారణ్యులు కాశీపండితుఁడు నాల్కలు కొఱికికొని యీపట్టణము రెండుంబాతికె శతాబ్దముల కెక్కువకాల ముండదని నిశ్చయించుకొని యంత్రమును స్థాపనచేసి పురనిర్మాణమును బ్రారంభించిరి. మొదటిశంఖ మొక క్రొత్తబిచ్చగాఁ డొత్తినదఁట. ఆపట్టణము విద్యారణ్యులవారి ప్రేరేపణముచే స్థాపించినది కావున దానికిఁ దొలుత విద్యానగరమని పేరుఁబెట్టిరి. రెండవహరిహరరాయలనాఁ డేకచ్ఛత్రాధిపత్యముగా సామ్రాజ్యమును స్థాపించినపుడు దానిని విజయనగరమని మార్చిరి. యంత్రమందలి బీటికల సూచన ననుసరించి 1336 సం॥ మొదలుకొని 1565 సం॥ వరకు నాపట్టణము దాని పేరిట నేర్పడిన సామ్రాజ్యము హిందూధర్మసంరక్షణము చేసి తురకలను కృష్ణానది దాఁటిరాకుండ నాఁపి సంస్థాపకుల యాదర్శమును సఫలము చేసినది.

## ఛాందోగ్యోపనిషత్తునందలి చతుర్థప్రపాఠకమునఁగల

—* ఆఖ్యాయిక *—

(చివుకుల వెంకటాచలశాస్త్రిగారిచే నాంధ్రీకృతము)

మ. తనరుం బూర్వమునన్ జనశ్రుతి నపత్యంబైన రాజేంద్రుఁ డ
య్యనఘుం డర్థుల కన్నవస్త్రముల నిత్యం బత్యుదారాత్ముఁడై
ప్రణిబద్ధంబగు శ్రద్ధతో నొసఁగు. ఎవ్వండున్ మదీయాన్నమే
తినుఁగాకంచు సమస్తదిక్తటుల నూఁదెన్ సత్రశాలావళిన్. 1

తే. ఘర్మకాలంబునను నిజహర్మ్యముపయి
పుడమిఱేఁ డుండ నొకనాఁటి నడికిరేయి
అతని దాతృత కక్కజమంది నజడ
దారు లెల్లరు హంసలై బారుతీరి. 2

ఉ. పాఱుచునుండ నాకసమ్ముపై వెనుకన్ నడతెంచు నంచ ముం
పాఱెడుదానితో ననియె. "భల్లవిలోచన! స్వర్గతుల్యమై
భూరినృపాలతేజమది పొంపిరివోయెడు. కాల్చునేమొ. ఆ
దారితొలంగఁ బెట్టు"మన దానికి నాద్యమరాళ మిట్లనున్. 3

తే. అల్పుఁడగు నీనృపాలునియందు నేమి
గరిమ గన్గొంటివో సయుగ్వంతుఁడైన
రైక్వునింబోలెఁ బేర్కొలు రక్తిగదుర
సలిపినాఁడవు సఖుఁడ! ఇట్టులపుఁ డెగువ. 4

వ. అనవిని నీచే నుగ్గడింపఁబడిన రైక్వుం డేమిప్రకారంబువాఁడనిన నంతిమంబునను భల్లాక్షం బిట్లనియె.

సీ. చతురంకయుతమైన కృతనామకాయంబు
సోగటాలఁ గ్రీడింప జూదమందు
త్రిద్వ్యేకసంఖ్యాక త్రేతాద్యభిఖ్యాయ
ములలోఁబఱచికొన్న చెలువుదోఁప
సకలలోకప్రజాచరితశోభనధర్మ
జాత మెవ్వని ధర్మచర్య నిముడు
అవ్వాని వేద్యవిదగ్రగామిని రైక్వ
పలికితి నన్న నప్పురివృఢుండు

నిఖిలమఖముఖ ధర్మ వినిర్మితాఖి
లామృతాశనసమ్మదుఁ డచ్ఛకీర్తి
ధవళితాశాంతరుండు సాధనచతుష్ట
యాన్వితుం డప్రమత్తుఁడై యాలకించి— 6

మ. తన కుత్సేకవిభంజకంబుగను గుత్సారూపమై యన్యవి
జ్జనరైక్వాదులకున్ నితాంతము ప్రశంసారూపమై యున్న వా
క్కని నిక్కంబుగ దానినిం దెలిసి చింతాక్రాంతతన్ హంస దె
ల్పిన యయ్యర్థము సారెకున్ మది విమర్శించెం బ్రసక్తాత్ముఁడై. 7

ఉ. ఉల్లసముం గలంచుచు సముల్లసనంబు దొఱంగి పెల్లుగా
ఉల్లమునందుఁ దల్లడమునొందుచు హల్లకపాణిఁగాంచి రం
జిల్లుట యొల్లఁబాటు గని చేడ్పడి నిద్దురవోక మాని భూ
వల్లభుఁ డెల్లిదంబునకు వందురుచున్ నిశ వేఁగఁజేసినన్. 8

సీ. ఎడఁబాటుగలవారి యెడఁ దావి సుడియు పూ
టడిదంబు జళిపించుటుడిగె మరుఁడు.
ఎల్లదిక్కుల సముత్ఫుల్లదబ్జరజంబు
పిల్లతెమ్మెర లుల్లసిల్లఁ జల్లె.
ఆణిముత్తియముల ట్లాకసంబునఁబర్వి
పొలుపారుచున్న రిక్కలు జుణింగె.
గూండ్లలోపలి పులుంగులు సంకులంబుగా
కూయు చొండొంటి మేల్కొలుసలిపె.
గిరిగుహాలలోన నిరులు గ్రిక్కిరియఁబఱచె.
నెలవెలంజూపె దీపికల్ కళదొఱంగి.
పాఱు లరిగిరి కాసారవారిఁ గ్రుంక.
బటువుగువ్వల యుత్తలపాటు సడలె. 9

గీ. తల్పముఁ దొఱంగి పిదపఁ బౌత్రాయణుండు
క్షత్తఁ జేరంగఁజీరి వత్సా! రయంబ
రైక్వుఁ దోడ్తెమ్మటన్న నారైక్వుఁ డెట్టిఁ
డనఁగ నతనికి రాజన్యుఁ డనియె నిట్లు. 10

క. కృతనామకాయ మది యే
గతిఁ బ్రేతాద్యాయములను గబళించెడి నా
గతి సకలజనుల సుకృత
మ్మెతనివృషంబునన యముడు నెఱుఁగు మతనిగన్. 11

గీ. పలుకని క్లేగి నల్గెలంకులను తీత్త
వెదకి వేసరి రైక్వుఁడన్ విప్రుజాడ
కలికమునకైన నొక్కింత గానరాద
అనుచుఁ గ్రమ్మఱివచ్చి పల్కె నధిపునకు. 12

వ. అంతఁ బౌత్రాయణుండగు జానశ్రుతి యిట్లనియె. 13

మ. గళితాత్మీయవిరోధజంతునిలయక్ష్మాభృద్గుహాంతర్నదీ
పులినారణ్యములందుఁ గాక కలుషీభూతాంతరంగప్రజా
కలితంబైన యుదాత్తపత్తనపురగ్రామంబులన్ రథ్యలన్
నిలువంజొత్తురె బ్రహ్మవేత్త లెపుడున్ ? నీవింత చింతింపుమా.

వ. కావున బ్రాహ్మణు నన్వేషింపఁదగిన స్థలంబున కరిగి తేని యమ్మహానీయుం డక్షివిషయం బగుననిన. 15

శా. భూమీశుండు వచించినట్లు చని యప్పుణ్యాత్ము రైక్వాహ్వయున్
పామం గీరుచు బండిక్రింద వసియింపం జూచి యేకాకి నా
ర్యా ! మాన్యుండగు రైక్వనామకుఁడ వీవా యన్న నేనేయటం
చామహాసీంద్రుఁడు వల్కనం జని యతం డారాజుతోఁ దెల్పినన్.

ఆ. వె. ఐదునూర్ల మొదవు లశ్వతరీరథ
మ్మొక్క కంఠహార ముడుగరగను
రాజు గొంచుఁబోయి రైక్వునికడ నుంచి
అతని కిట్టులనియె నధికభక్తి. 17

ఉ. క్షీరసమృద్ధధేనుకముఁ జిత్రిత దివ్యరథమ్ము మోహనా
కారముఁ బ్రోజ్జ్వలన్మణివికారముఁ జారుమరీచివారికా
సారము సంవృతాంధతమసాగకుఠారము సర్వదైన్యసం
హారముఁ గంధరస్థలవిహారము సారము భూరిహారమున్. 18

క. కానుకలివె కొనివచ్చితి
వీనిన్ గ్రహియించి కరుణ వెలయించియు రై

క్వా! నా కుపదేశింపుము
పూనిక నీకొల్చుదైవము ననఁగ మునియున్. 19

గీ. అధికశోకంబుచేఁ గార్శ్యమందినట్టి
వాఁడ నీతెచ్చినట్టి పశ్వాదికంబు
నీకడనెయుండుఁగాతమనిన మునివరు
ఆశయమెఱింగి రాజు గృహంబు సేరి. 20

వ. మగిడివచ్చి 21

ఉ. ఆలోకవేయి రత్నమయహారము నశ్వతరీరథమ్ము మ
ద్బాలికయున్ నివాసిసుఖదంబులు గ్రామము లోలిఁ దార్చితిన్
హాళిమెయిన్ గ్రహించి యివియన్నియు రైక్వ! మహానుభావ!ఉ
ద్వేలకృపన్ ఘటించి యుపదేశమొసంగి కృతార్థుఁజేయవే. 22

వ. అనిన గ్రహియించి 23

శా. జాయార్థార్పితధారుణీశ్వరసుతాస్యాబ్జంబె తీర్థంబుగా
ఆయోగీంద్రుఁ డెఱింగి యియ్యది యుపాయంబై తగన్ నేను వా
చాయుక్తుండయితిన్. మహావృషకదేశంబందు నీగ్రామము
లొప్పయుంగాత యశంబటంచనియె నెప్డున్ రైక్వపర్ణాఖ్యలన్. 24

గీ. పిదప రైక్వుండు సంవర్గవిద్య నృపతి
కాదరంబున నుపదేశమాచరింప
అయ్యది గ్రహించి రాజన్యుఁడట్లు యాచ
రించి సంసారఘోరవారిధిఁ దరించె. 25

---

## —♦ గోవర్ధనాచార్యుఁడు ♦—

(మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు)

ఇతనికాలము సరిగా నిర్ణయించు నాధారము లేదుకాని జయదేవుఁడు గీతగోవిందము మొదట 'శృంగారోత్తరసత్ప్రమేయవచనై రాచార్యగోవర్ధన స్పర్ధీకోపి నవిశ్రుత' యని వర్ణించుటచే నతని కీతఁడు పూజ్యుఁడైన సమకాలికుఁడైయుండునని దుర్గాప్రసాదపండితులు వ్రాసియుండిరి. ఈజయదేవుఁడు వంగదేశాధిపతియగు బల్లాలసేనుని పుత్రుఁడగు లక్ష్మణసేనుని సభలో నున్నవాఁడని సనాతనగోస్వామి మతమైనట్లు కనఁబడుచున్నది. 'గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః, కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్యచ' యను శ్లోకము లక్ష్మణసేనుని సభామందిరద్వారము మీఁది శిలపై వ్రాయఁబడియున్నట్లు తెలియుచున్నది. ఈలక్ష్మణసేనుఁడు క్రీ॥శ॥

11 వ శతాబ్దంబు తుదను వంగరాజ్యము నేలినట్లు చరిత్రకర్తల యభిప్రాయము. కావున నీగోవర్ధనుండు 1080, 1140 నడుమ నున్నవాఁడని యూహింపఁదగును. ఇతఁ డేడువందల యార్యావృత్తములుగల యార్యాసప్తశతియను కావ్యము రచించె. అందు వాల్మీకిమొదలుగా భవభూతివఱకును గల పూర్వకవులు నుతింపఁబడిరి. ఇతఁడు వంగదేశస్థుఁడు. బ్రాహ్మణుఁడు. ఈతనితండ్రి మహాకవియుఁ గర్మపరతంత్రుఁడు నగు నీలాంబరసోమయాజి. సోదరుఁడు బలభద్రుఁడు. శిష్యుఁ డుదయనుఁడు. ఈయంశములెల్ల నీతని కావ్యమువల్లనే తెలియుచున్నవి. ఈకావ్య మొక కథను దెలుపునది కాక వివిధనాయికానాయకలక్షణంబులను వారి సఖుల లక్షణంబులను బోధించుచుఁ బరస్పరచాటుసంభాషణరూపకంబుగా నున్నది. ఇం దకారాది క్షకారాంతముగల వర్ణము లాదియందుఁ గ్రమముగాఁగల కొన్నికొన్ని పద్యములు వ్రజ్యలను నామములతో విభజింపఁబడినవి. ఈతని కవిత్వము సులభమై సరసదృష్టాంతోపమాలంకృతంబై యలరారుచున్నది.

శ్లో. అతిపూజితతారేయం దృష్టి శ్శ్రుతిలంఘనక్షమా సుతను
జినసిద్ధాంతస్థితిరివ సవాసనా కం నమోహయతి ?

అనుపద్యము నాయిక దృష్టివిశేషసౌందర్యముం దెల్పుచు జినసిద్ధాంతమును నిరసించుచు నెంతయు హృద్యముగా నున్నది. మఱియు

శ్లో. అన్యాస్వపి గృహిణీతి ధ్యాయ న్నభిలషిత మాప్నోతి
పశ్యన్ పాషాణమయీః ప్రతిమా ఇవ దేవతాత్వేన.

అను నాయికాసఖీవచన మన్యనాయికారక్తుఁడగు నాయకుని ధర్మము దెల్పుచు విగ్రహారాధనవిధిని బోధించుచున్నది. ఇట్లే యీకావ్య మాద్యంతము సకలలోకధర్మములం దెలుప నాదర్శముగా నున్నది.

---

## —* అగ్గిపెట్టెల యన్యాయము *—

పరదేశములవా రన్నివిధములచేతను హిందూదేశధనమును సంపూర్ణముగాఁ బీల్చి పిప్పిచేయుచున్నారు. చెఱకు తీపిగానున్నదని వేళ్ళతోఁగూడఁ బెల్లగించు నక్కలవలె వీరు మితిముదప్పి ద్రవ్యమును మొదలంటఁ బిండివేయుచున్నారు. అది ప్రత్యక్షముగాఁ గానరాక కొంచెము లోఁతుగ విమర్శించువారికి మాత్రమే విశదమగుచుఁ జల్లచల్లగా జలగ యెట్లు రక్తమును బీల్చునో యట్లు జరుగుచున్నది. తక్కిన విషయము లట్లుంచి యొక్క యగ్గిపెట్టెలవలన నెంతద్రవ్యము హరింపఁబడుచున్నదో గణించుటకు శక్యముగాకుండెను. ఇందులో నెంతమోసము చేయఁబడుచున్నదో యెవరును గనుగొనఁ జాలకున్నారు. కానికి రెండు పెట్టెలు వచ్చుచున్నవన్న సంతోషమే కాని యందు మన ముపయోగించుకొనుచున్న పుల్లలు పదియో పండ్రెండో ... తక్కినవి పెంటపాలే యగుచున్నవి ... మనకు దిగుమతియగుచున్న పెట్టెలలో

సంసారిపెట్టెలనియు వ్యభిచారిపెట్టెలనియు నిరుతెఱఁగులుగానున్నవి. వ్యభిచారి పెట్టెలనునవి తొలుతనుండియు వచ్చుచున్న యొఱ్ఱమందుపెట్టెలు. ఈపుల్లలు తన పెట్టెయే కావలెనను నియమములేకుండ నెచ్చటగీసిన నచ్చట మండుగుణము గలవి యగుటచే వ్యభిచారి పెట్టెలనఁబడుచున్నవి. సంసారిపెట్టె లిటీవలవచ్చుచున్న నల్లని మందుగలవి. ఇవి తనపెట్టెను గీసిననే కాక మఱియెట్టిచోట గీచినను వెలుఁగవు. కావున నవి సంసారిపెట్టెలనఁబడుచున్నవి. దూర మాలోచింపఁగా నివియైనను సంసారిపెట్టెలు కాఁజాలవు ఏపెట్టెలోనున్న పుల్ల లాపెట్టెకే వెలిఁగి రెండవ పెట్టెకుఁ బనికిరాకున్నచో నట్టినామము చెల్లియుండును. తమజాతి యేపెట్టెకైనను నివి వెలుఁగుచుండుటచే సజాతీయవ్యభిచారదోషము వీనికిని గలిగినది ... ప్రస్తుతము మనదేశమునకు దిగుమతియగుచున్నవి సంసారి పెట్టెలును గాక వ్యభిచారిపెట్టెలును గాక సన్యాసిపెట్టెలగుచున్నవి. సన్యాసు లెట్లు నిరుపయోగులో యట్లే యివియును నిరుపయోగములగుచున్నవి. ఇందులోఁ జమత్కార మేమనఁగా నల్లనిమందుపెట్టెలు మఱియొకచోట గీచిన వెలుఁగనివగుటచే నాపెట్టెయందే గీయవలెను. అట్లుగీయు టకు మందుకొంచెము దళముగాఁ బేడుమీఁదనే పట్టింపకలసియున్నది ... అది నిరంతరమును ఘర్షణముగలచోటుగనుక మం దాకఱ్ఱపేడుకే దళముగాఁ బట్టించి నచోఁ బుల్లలన్నియు సరిపోవువఱకును బోకుండ నుండును. అట్లుచేయక యామోస గాండ్రామందు నొకపలుచని కాగితముపైని బ్రామి పంపుచున్నారు. ఇందుఁ జిత్రమేమనఁగా నొకటిరెండుపుడకలు ఛెఱ్ఱున గీయునప్పటి కుల్లిపోరవంటి యాకాగి తము చినిఁగి తుక్కుగుటయు మఱిగీయుటకు హంగులేక యాపుడక లన్నియుఁ బెంటపైఁ బోయుచున్నారు. ఇఁక ఱెండవరకపు టెఱ్ఱమందుపెట్టెలు పైనవ్రాసిన విధమునఁ గాక పెట్టెప్రక్కను బేడుమీఁద దళముగా గఱిమందు పట్టించుచున్నారు గాని పుల్లలకుఁ బట్టించు మందులోనే దాని ప్రాణము తీసివేయుచున్నారు. పుడక గీయఁగానే చురచురలాడి యట్టె యాఱిపోవుచున్నవి. దానిలో వెలిఁగెడు పదార్థము తక్కువ గల్పుచున్నారు. ప్రక్కనుండు పేడుకుఁ బట్టించుట మనయందు దయచేఁ గాదు. ఆపుల్ల లేగోడను గీసినను బడునుగనుక నట్లు పట్టించుచున్నారు. అట్లుపడక యాపెట్టెయే కావలసియున్నచో వానికిని నామందు పలచనికాగితములపై బామి యుందురు. ఇందువలనఁ గానియిచ్చి 2 పెట్టెలు తేఁగా మఱురోజుననే తిరిగి కావలసివచ్చుచున్నది. కనఁబడని వ్రియము. ఆహా! ఎంతమోసము ? మనదేశము చేసికొన్న పాపముచేఁగదా యిట్లు మోసగాండ్రింపఱును జేయుచున్నారు. ఇంత కన్న మన పూర్వపుఁ జెకుముకిరాళ్ళను దూఁటకట్టెలునే యుక్తమగునేమో యని తోఁచెడిని. ఇందునుగూర్చి ప్రతిపత్రికాధిపతియుఁ బ్రతి ప్రముఖులును వ్రాసి చెప్పి యింగ్లీషుపత్రికలకు వ్రాసి దొరతనమువారికి నివేదించి యీమోసము నిల్ప చేయించుటకై ప్రయత్నింతురుగాక. మనదేశములోనే తఱచుగా నివి చేయుభాగ్య మును గలిగించుటకై ప్రయత్నింపుఁడని వ్రాయుటకుఁ జేతు లాడవు.

" సుదర్శని.

సీ. నరనాథకులకాననము దహించుటకును
అవనీసురుల విత్త మగ్నికీల.
జననాయకుల నిజైశ్వర్యాబ్ధి నింకింప
బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు.
పార్థివోత్తముల సంపచ్ఛైలములఁ గూల్ప
భూసురధనము దంభోళిధార.
జగతీవరుల కీర్తిచంద్రిక మాప వి
ప్రోత్తము ధనము సూర్యోదయంబు.
విప్రతతిసొమ్ము కంటెను విషము మేలు.
గరళమునకును బ్రతిక్రృతిగలదు కాని
దాని మాన్పంగ భువి నౌషధములు లేవు.
కాన బ్రహ్మస్వములు గొంట గాదు పతికి. ౧౯౧

కం. ఎఱుఁగమినైనను భూసుర
వరుల ధనం బపహరింపవలవదు పతికిన్
మఱపున ననలము ముట్టిన
దరికొని వెసఁ గాల్పకున్నె తను వెరియంగన్ ? ౧౯౨

తే. శ్రీమదాంధులు సొమ్ముచేతఁ జిక్కు
పడుదురే రెండు బోయఁడు పసులఁదోలు
పగిది నుగ్రభుజావిజృంభణసమగ్ర
సుమహితాటోప మనిలోనఁ జూపకున్న ? ౧౯౩

కం. ధారుణిలోన వదాన్యుల కీరానిపదార్థ మొక్కటేనింగలదే ?
కోరినఁ దన మేనెముకలు ధీరుండై యిచ్చెనని దధీచిని వినమే ?

కం. ఆయిందాగ్నులు శ్యేనక
వాయసరూపములఁ దన్ను వలఁతిగ వేడన్
ధీయుతుఁడై మును శిబి తన
కాయము గోసిచ్చెనన జగంబుల వినమే ? ౧౯౫

చం. హరి భజియించుహస్తములు హస్తము లచ్యుతుఁ గోరి మొక్కు న
చ్చిరము శిరంబు చక్రధరుఁజేరినచిత్తము చిత్త మిందిరా

వరుఁగనుదృష్టి దృష్టి మురవైరి నుతించినవాణి వాణి య
తురు కథలానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్. ౧౯౬

ఆ. దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁడైన హరికి ధరణిసురులు
దైవతములుగాన ధారుణీదివిజుల
కంటె దైవ మొకడు కలదె భువిని ? ౧౯౭

తే. పుత్రదారగృహక్షేత్రభూరివిషయ
ఘనసుఖాసక్తుఁడగుచు నేమనుజుఁడేని
అర్థిఁ జరియించు వాఁడు భవాబ్ధిలోన
చెంది యెన్నాళ్ళకును దరిఁ జేరలేఁడు. ౧౯౮

కం. ధరణీసురశాపమునకు
హరిహరబ్రహ్మదులైన నడ్డముగలరే ?
నరులనఁగ నెంతవారలు
కరమరుదుగఁ బూర్వజన్మకర్మము ద్రోవన్ ? ౧౯౯

తే. సర్వభూతమయుండైన సరసిజాక్షుఁ
డతఁడె తన యాత్మయందుండుననెడువాఁడు
శంఖచక్రధరుండంచుఁ జనెడువాఁడు
భక్తిభావాభిరతుఁడు వో భాగవతుఁడు. ౨౦౦

కం. పరమబ్రహ్మమనంగన్
పరతత్త్వమనంగఁ బరమపదమనఁగను నీ
శ్వరుఁడనఁ గృష్ణుఁడన జగ
ద్భరితుఁడు నారాయణుండు దా వెలుగొందున్. ౨౦౧

కం. తారలనెన్నఁగవచ్చును భూరేణుల లెక్కపెట్టఁబోలును ధాత్రిన్
నారాయణగుణకథనము లారయ వర్ణింపలేరు హరబ్రహ్మదుల్.

తే. మృదులపక్వాన్నభోజనములను మాని
జీవహింసకుఁ జనువానిఁ జెందు నఘము.

హరి నుతింపక స్త్రీలోలుఁడైనవాఁడు
నరకవాసుండు నగుచుండు ననవరతము. ౨౦౩

ఉ. దారలయందుఁ బుత్రధనధాన్యములందు ననేకభంగులన్
కూరిమిసేయు మర్త్యుఁ డతిఘోరవియోగజదుఃఖమగ్నుఁడై
నేరుపుదక్కి చిక్కువడి నీతివివేకవిహీనుఁడై మనో
భారముతోఁ గపోతపతిభంగి నిజంబుగఁ బోవు నష్టమై. ౨౦౪

కం. మోహితుఁడై వసుకాంతా
వాహినిలోఁ జిక్కి క్రూరవశుఁడౌ మనుజుం
డూహాపోహా లెఱుంగక
దేహము నలఁగంగఁ జేయు దీనత నెపుడున్. ౨౦౫

మ. హరినామాంకిత సత్కథామృతరసవ్యాలోలుఁడైనట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథా లవణవాఃపూరంబుఁ దాఁ గ్రోలునే?
వర మందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె చేఁదు వేములకుఁ దద్గంధానుమోదాత్మమై?

కం. గజతురగాదిశ్రీలను
నిజమని నమ్మంగరాదు. నిత్యమును హరిన్
గజిబిజిలేక తలంచిన
సుజనులకును నతనియందుఁ జొరఁగావచ్చున్. ౨౦౭

కం. బలవంతుఁడైనవాఁడే
కులహీనుండైన దొడ్డగుణవంతుఁడగున్.
కలిమియు బలిమియుఁ గలిగిన
ఇలలోపల రా జతండె. ఏమనవచ్చున్? ౨౦౮

చ. మృతియును జీవనంబు లివి మేదినిలోపల జీవకోటికిన్
సతతము సంభవించు. సహజంబిది. చోర హుతాశ సర్ప సం
హతులను దప్పి నాఁకటను బంచతనొందెడునట్టిజీవుఁ డా
పదలను గుంది పూర్వమగుపాపఫలంబు భుజించు నెప్పుడున్.

మ. భగవంతుం బురుషోత్తమున్ హరిఁ గృపాపాథోధి లక్ష్మీశ్వరున్
సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వభూ

తగుహావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైకపారీణు నా
జగదాత్మ్యుం గనుచుందు రార్యులు తపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై.

చ. తనువునఁబుట్టినట్టి బెడిదంబగు కష్టమహాగదంబుచే
వనరి తదీయచర్మము వివర్ణతనొందనరీతి భృత్యులో
ప్పనిపని సేసినన్ విభులు బంధుర చారుయశంబుఁ బేరుఁ బెం
పును జెడిపోయి దుర్యశముఁబొందుచునుందురు విష్టపంబులన్.

తే. పూని సుఖదుఃఖములు రెంటిలోన నెద్ది
దైవవశమునఁ జేకుఱు దానఁజేసి
డెందమునఁ జాల సంతుష్టినొందువాఁడు
విమలవిజ్ఞానియన భువి వెలయుచుండు. ౨౧౨

చ. అనుపమభక్తి నెవ్వనిపదాంబుజమూలము మందిరంబుగా
ననయముఁబొం దెవాఁడు నిహతాఖిలభూరిమనోమలుండు స
జ్జనుతవిరక్తిబోధధృతి వీర్యవిశేషసమన్వితుండు దా
ననఁదగి భూరిసంసృతి మహత్తరదుఃఖము నందఁ డెన్నడున్.

తే. అగ్నిముఖమునకంటె ధరామరేంద్ర
ముఖము పరిశుద్ధ మత్యంతముఖ్యమనఁగ
తనరునదిగాన భూసురార్చనము సకల
జనులు గావింపఁదగు నార్యజనములార ! ౨౧౪

కం. పరికింపఁగ నేమనుజుఁడు
హరిపదమును బొందఁజేయునట్టి వివేక
స్ఫురణం దనర్చు వానికి
పరువడి నిలఁ బొందరానిపదముం గలదే ? ౨౧౫

మ. ఎనయన్ క్షుత్పరిపీడఁ గుంది శునకం బింటింటికింబోవఁ బూ
నినఁ దద్దైవికమైన దండహతిగానీ కాక చౌర్యాన్నమై
నను గానీ తగఁ బొందుచందమున నెన్నన్ దైవయోగంబు పెం
పున నీజీవుఁడు దాఁ బ్రియాప్రియములం బొందుం బ్రదిలోకంబులన్.

ప్రథమభార్య పడిపోవునాఁటికి నాదుప్రాయము పంచాశత్తున కింకను రెండు తక్కువయే. పంచాశదబ్దంబులపర్యంతము పరిణయాధికారము పురుషున కుండి యున్నది. కాని

ఉ. నల్వదివత్సరంబులకె నాదుశరీరమునందు రక్తపుం
కాల్వలవేగ మాఁగుటయుఁ గన్గవ నిద్దపుటద్దపుం గవన్
చెల్వను గాంచనయ్యె. నడునెత్తి వికేశము. తక్కునౌదలన్
మొల్వవు నల్లవెండ్రుకలు. మోము వివర్ణతగాంచె నేమనన్ ?

ఉ. దంతము లొక్కడొక్కడు పదంపడి యూడఁగఁజొచ్చె. కాళ్ళతోఁ
పెంతయునేర్పడెన్. బలవిహీనుఁడనైతిని. దానఁజేసి ర
వ్వంతపనిం బొనర్చుటకె యంగము లోపక పోయె. ఇట్లు బల్
వింతగ నడ్డై నేను శతవృద్ధుగఁ దోఁచితి నేమిచెప్పుదున్ ?

మఱియుఁ బెక్కండ్రు బిడ్డలఁ గనినను నొక్కరును దక్కమి నన్నుతనయు నొకనిఁ బెనుచుకొనుఁడని యనేకు లనఁజొచ్చిరి. పిల్ల లెట్లును వీరికి బ్రదుకరనియు నంత్యమున కన్నకొడుకులే దిక్కనియు ననసాగిరి. అది యంగీకరింపలేదు కాని యగ్రజు నైదవయాత్మజు నాలుమాసములలోపలి ప్రాయమున నతికి పోవునుగాన పెంచుకొందమని పెద్దభార్యతో యోజించికూడ నుంటిని. ఈకారణములచేఁ దజ్జ్యేష్ఠ పత్నిని దహనముచేసి మూర్ఛీభవించిన చిత్తముతో మూల్గుచు వచ్చి యష్టమగర్భ మేఱుపడు టాదిగా నస్మత్కుటుంబము నాత్మీయగేహముననే యుంచుకొని యౌషధమిచ్చుచు నఖిలవిధముల నాదరించిన ప్రసాదరావు భవనముననే పడవుచుం బడియుండి పుత్రకళత్రహీనుఁడనైన నేను బొద్దుపొడుచుటతోడనే పెద్దమనుష్యు లన్నకొడుకు కర్తృత్వముతో నపరకర్మ మాచరింపుమని బోధించినచోఁ దల్లిచచ్చిన పిల్ల నేమిచేయుదునా యని వేకువజామున విచారపడఁగడఁగితిని గాని పునర్వివాహ విషయమై మనంబున ననుకొన్నవైన ననుకొనినవాఁడను గాను. మఱునాఁడు మాపటికిఁ బురిటికిఁ బిల్వవత్తురని మురియుచున్న నరసరావుపేటలోని నామేనల్లునింటికి నడతెంచి యుడుకుచుండుటయు నామఱునాఁటి సాయంకాల మస్మద్దుఃఖమును జూడలేక యాత్మజాత మరణమున కలమటించు నత్తయే మరల వివాహమైన బాగుండునని ప్రస్తావించి ప్రోత్సహించినపైఁ బునర్వివాహేచ్ఛాంకురము మనఃక్షేత్రమున మొలకయెత్తెను. అప్పుడు మరల మజ్జాతకచక్రము తిరుగవేసితిని. ద్వికళత్ర యోగమున్నపుడు తిరిగి పరిణయ మేలకాదాయన్ని యరయ మొదలిడితిని:

కాని సతీవియోగదుఃఖముతో స్వయముగా నిర్ణయించుకొనలేక జ్యోతిషికుల విచారించితిని. అంతంతమాత్రపు జ్యోతిషికు లది యౌవనవంతుల విషయము కాని యతీతవయస్కుల విషయము కాదనిరి. అది యాత్మకు నచ్చక పెద్దపెద్దలను వెదక మొదలిడితిని. హైదరాబాదులో నచ్యుతరామశాస్త్రులుగారను నధికయశశ్శాలి

రొక రగుపడియెను. ఆయన హైదరాబాదు రాజ్యమున కెల్ల నమాత్యులగు కిషన్ ప్రసాదుగారినే మెప్పించి వేలయకరముల భూమినార్జించిన విద్వాంసుఁడు. అద్వైతజ్ఞుఁడు నాజాతకచక్రముఁ జూచినతోడనే ద్వికళత్రయోగ మీజాతకమునకు దివిటీవేసి కనఁబఱచుచుండ శంకించిన జాల్మురెవరని చప్పునఁ జెప్పివేసెను. అక్కడి కాసంశయము తీఱినుగాని 'వృద్ధస్య తరుణీ విష' మనుశ్లోకపాదముమాత్రము బాధించినది. ఈశ్లోకపాదమున కనుగుణముగనే యెందఱో భయపెట్టిరి. ఏమిపెండ్లిలేయని యీసడించిరి. మొత్తమునకుఁ బునర్వివాహము చేసికొనుమన్న వారిసంఖ్యయే యధికము కాని యనిష్టమునుసూచించినవారును ననేకులు కలరు. ఆసంశయముగూడ నచ్యుతరామశాస్త్రిలుగారే తీర్చివేసిరి. సతియై త్రితయమునకుఁ దక్కువ గాకుండ సుతులం గనునని స్తుతించిరి. వీరి గురువులైన శ్రీధర వెంకటశాస్త్రిలుగారును సిద్ధాంతీకరించిరి. ఇంత శోధించి యేను జేసికొన్నందుల కేఁబదియువదేండ్లవాఁడనగు నన్నెంతయుఁ బరిచరించుచును నీడునకుమించిన యింటింతపనులును నిర్వహించుచును బుత్రపుత్రికలఁ బోషించుచును జాలఁ దెలివికలదనియు సత్ప్రవర్తనగలదనియుఁ బేరుదెచ్చుకొన్న పెండ్లము దొరకుటయే పెత్తనముందున్న నా పెద్దభాగ్యము. 'భార్యాదుఃఖం పునర్భార్యా' యను పద్యపాదము సార్థకముచేయుచు నీభార్యవచ్చి ప్రథమభార్యావియోగదుఃఖమును బోఁగొట్టుటయే కాక యనేకాంశములలో నద్దానికన్న మిన్నయై దాని మఱపించినదికూడ. సౌందర్యవతులలోఁ బరిగణింపఁదగినది చిన్నభార్య. సర్వసాధారణ యున్నభార్య. అది స్వదేశస్థురాలు. ఇది విదేశస్థురాలు. అది పిట్టకాలితోఁ గబురంపి చుట్టములను రప్పించుకొనినది. ఇది తండ్రిచచ్చినతరువాత నుత్తరముముక్క వ్రాయువారుగూడ లేక యుడుకుచుండినది. ఇరువురకును నిది తారతమ్యము. ఇంతియేకాని యితరవిషయములలోఁ బెద్దది చిన్న, చిన్నది పెద్ద. వేయేల! యువసం॥ ఫాల్గున బ 3 ఉపనయనము నిశ్చయించుకొని యిరువదైదు దినములకు ముందే దేశమునకో యేగుచు ముహూర్తమునకు మూడుదినములు ముందుగా వచ్చెదననియు వచ్చులోపల సర్వము సంసిద్ధము చేయవలసినదనియు వాఁకిటిలో బండలు పఱపించి గచ్చుకాలువ కట్టింపవలసినదనియు నెన్నెన్నియో చెప్పిపోయి చెప్పిన చొప్పున వచ్చుటయు వచ్చులోపల నొరులసహాయము లేకుండ నొక్కరితయే యుపనయనసంభారములఁ గూర్చియుఁ బాలికాఁపులచేత బండ్లుకట్టించి కారెంపూడి బండలఁ దెప్పించియుఁ జప్టాఁజేయించియుఁ బనివాండ్రఁ బలిపించి కాల్వఁ గట్టించియు సర్వము సంసిద్ధపఱచి స్వాత్మజు నుపనయనము చక్కగా జరుపుకొని సర్వులచేతను సంస్తుతింపఁబడినదనుటకంటె దీని తెలివితేటలు విశేషించి వ్రాయవలసిన పనిలేదు. చరిత్రగనుక నుండినది యుండినట్లు వ్రాసితిని గాని యిద్యాది స్తుతిగాదు. నస్తుతిః 'పుత్రిభార్యయో'రను నార్యోక్తి సత్యకథనమునకు నిషేధకము కాదు. ఈబిడవయ స్సీధాత కిరువదియేడువత్సరములు. చిన్నదానితోపాటి చిన్నదియుఁ గుజ్జువాండ్రవలె గొణుగుటయే కాని చదువుసంధ్యలుమాత్ర మంతగా సాధించినదికాదు. కాని నేను తెనిమాసమున నద్రిసులు మొదలైనవి యంటించి పత్రికఁబంపుటకుమాత్రము పరుల నపేక్షింపవలసిన పనిలేదు. దీనికిఁ దలిదండ్రులం పెట్టినపేరలమేలుమంగ కాని యిక్కడఁ గమల యని పిలుచుచున్నారు.

## —♦ అగ్రసుతుఁడు ♦—

శోభకృత్సంవత్సర వైశాఖ శు ౧౨ శుక్రవారము (8-4-1903) నా ప్రథమ వివాహము. కీలకసం॥ భాద్రపద శు ౧ (4-9-1908) నిషేకము. సౌమ్య సం॥ పుష్య బ ౮ (29-1-1910) ఈ యగ్రసుతు నావిర్భావము. నలసం॥ భాద్రపద బ 3 (14-9-1916) వీని మరణము. వానికి మే మెంతఋణముంటిమో యంతయుఁ దీర్చుకొని యాఱేండ్ల యేడునెలల యిరువదితొమ్మిదిదినములకే యింద్రనగరమున కేగినవాఁడు. చచ్చిపోయిన బఱ్ఱె పగిలిపోయిన పండెఁడుపా లిచ్చెనని చెప్పికొన్నట్టు లట్టివానిచరిత్ర వ్రాయుట యనవసరముగాన నవసానానంతర మలమటించుచు వ్రాసిన కొన్నిపద్యములుమాత్ర మీక్రిందఁ బొందుపఱచి యవలఁ జనుదము.

సీ. నిద్రమంచముమీఁద నే నింక నెవరికి
క్రొత్తపద్యాల్ చెప్పికొనుదుఁ దండ్రి!
ఎచ్చోటికిని వెంట నే నింక నెవరిని
సంప్రీతిఁ దోడ్కొని చనుదుఁ దండ్రి!
ఎలమి భుజించుచో నే నింక నెవరిని
కోరి పొత్తుకుఁ బిల్చుకొనుదుఁ దండ్రి!
ఎటుపోయివచ్చియు నే నింక నెవరిని
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుకొనుదుఁ దండ్రి?
ఎత్తుకొని ముద్దులాడుచు నింక నేరి
పైనివేసుక నే సుఖంపడుదుఁ దండ్రి!
అకట! లోకోత్తరంబయినట్టి నీదు
చరితమెల్లను నే నెట్లు మఱతుఁ దండ్రి!

తే. బాలరామాయణంబును భాగవతము
అమరముం జెప్పికొంటి వీ వాఱువత్స
రములకే తండ్రి! ఇఁక నాఱుసమలెయున్న
ఎంతవిద్వత్త గలుగునో యెవ్వఁడెఱుఁగు?

సీ. సుత! తావకంబైన శ్లోకసుష్ఠుతకు శి
ష్టా హనూమచ్ఛాస్త్రి సైయనెఁగదె!
ఆత్మజ! నీదు పద్యస్వచ్ఛతకు బజ్జె
పలి లక్ష్మికాంతము బళియనెఁగదె!
కొడుక! నీధారణకుఁ గా మేష్టరైన సు
బ్రహ్మణ్య మబ్బురంపడియెనుగదె!

తనుజ! నీ గ్రహణంపు ప్రదీమ నందా పిచ్చ
యు పరీక్ష యొనరించి హాయనేఁగదె!
బిడ్డ! నీచాకచక్యంబు పెక్కుమనుజు
లరసి మేలని నినుఁ గొనియాడిరికదె!
పుత్రి! పదేండ్లకే యింతపొగడత గని
పడిపించి మఱల దివి కేగితికదె!

మ. హరినామస్తుతిపద్య మొక్కపరి నీ వాకాశపున్ వాణికై
న రహిం బాఠముచేసివేగ మరలన్ నన్ దన్ను మోతండ్రి! లే
ద రమేశ్లోకమొ స్వర్గమో యెదియొ నీధామంబు వాక్రుచ్చిమున్
త్వరఁ గొంపోయి పఠింపు మచ్చటనె యానందంబునుం బొందెదన్.

ఉ. ఏగతి స్వర్గలోకమున కెందులకో భువి వీడి. అద్ది మా
బాగె కుమార! నిన్ జిఱుతప్రాయమునుండియుఁ బెంచి పెద్దగన్
నేఁగద చేసినా! నదియు నీమది నుంచక నాకుఁజెప్పకే
ఈగతి నేగఁ బాల్పడితి. వింత కృతజ్ఞత యుండఁగూడదే?

సీ. పుట్టినాఁడవు నీవు పుత్రి! మాతామహు
వాసమా న ర్వేమవరమునందు.
పెరిఁగినాఁడవు నీవు బిడ్డ! త్వత్పితృపరం
పరయున్న యీజానపాటిలోన.
తిరిగినాఁడవు నీవు దేహజ! గుంటూరు
లష్కరు మొదలైన లావుపీళ్లు.
విడిచినాఁడవు నీవు కొడుక! ప్రాణము రావి
పాటిదగ్గఱి రోడ్డుపైన నకట!
చొచ్చినాఁడవు నీవు నాతూస్తి! సకర
కంటిలోని శ్మశానంపుమంటికిఁ ఁద.
తలఁచిచూచిన నీచరిత్రంబు చాల
అద్భుతావహ మయ్యెరా! హా కుమార!

ఉ. గుఱ్ఱపుబండియన్నఁ గడుఁ గూర్తువు నీవు కుమార! దాన నా
గుఱ్ఱపుబండిపైనె తుద గొల్లుననీజ ఁయితి యెట్వఁగఁ
బుఱ్ఱునఁ బ్రాణముల్ విడిచిపోతివి? పోవుచుఁగూడ నీయమఱ
వెఱ్ఱిగ నేడ్వకించనితివే సుకుమారక! హాకుమారకా!

# అభినవ సరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం|| 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 2 | నీతిగీతులు (సుమతిశతకము, దానికి శ్లోకములు) | ... | 0 | 2 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కరిణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] | ... | 0 | 4 | 0 |
| 5 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 6 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 7 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 3 | 0 |
| 8 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము | ... | 0 | 4 | 0 |
| 9 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 10 | రామాయణసారోద్ధారము | ... | 1 | 8 | 0 |
| 11 | డిటో (తెలుఁగుతాత్పర్యసహితము) | ... | 2 | 8 | 0 |
| 12 | పక్ష్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 13 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 14 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 15 | శంతనురాజచరిత్ర (ప్రాచీనప్రబంధము) | ... | 0 | 14 | 0 |
| 16 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 17 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 18 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 1 | 10 | 0 |
| 19 | సూతసంహిత (ఆంధ్రము) | ... | 2 | 0 | 0 |
| 20 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 21 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 22 | అస్పృశ్యతానివారణఖండనము (మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 23 | భారతకథాతత్త్వనిర్ణయము | ... | 0 | 4 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | డిటో నాగరఖండము (3 సంపుటము) | | 1 | 8 | 0 |
| 27 | డిటో నాగరఖండము (౪ సంపుటము) | | 1 | 8 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరు జిల్లా.

# స హా య ులు

౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి

౩ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.

౪ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల

౫ బేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట

౬ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురము

౭ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల; అయ్యవార్లంగారు - కొత్తాపురము.

౮ రాయచూరి బండేరావుగారు, అయినాపురము.

౯ పేరులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

౧౦ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.

౧౧ చిక్కరాజు మట్టపల్లిరావుగారు - చెలమర్తి.

౧౨ మునిపట్లు పట్టాభిరామారావుగారు - తిరుమలగిరి.

౧౩ గూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు - ఇటికాలపల్లి.

౧౪ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు
శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు ఏజంటు

౧౫ రామరాజభూషణ భాషానిలయము - పెంట్లవెల్లి.

౧౬ పలిపె వెంకటరావుగారు, వకీలు - కొల్లాపురము.

౧౭ గండికోట అనంతరామారావుగారు, జిల్లా పేష్కారు, ఆసఫాబాదు.

౧౮ అద్దంకి ... తిరువేంగడతాతదేశికాచార్యులయ్యవార్లంగారు, తక్కెళ్ళపాడు.